# 6. రెండాకులు ఒక మొగ్గ

## ముల్క్ రాజ్ ఆనంద్

బ్రిటీషు సామ్రాజ్యం భారతదేశంలో సుస్థాపితమైన తరువాత బ్రిటీషు పెట్టుబడిదారులు భారతదేశంలో గుత్త వ్యాపారాన్ని విపరీతంగా సాగించారు. దేశంలోని మానవశ్రమను, ధనాన్ని విపరీతంగా దోచుకొన్నారు.

పశ్చిమ యిరోపీయ పెట్టుబడిదారులు, బ్రిటీషు పెట్టుబడిదారులు అస్సాం టీ తోటల్ని గుత్తకు తీసుకొని భారతదేశపు మానవశ్రమను యేవిధంగా దోచి విపరీతమైన లాభాలు గడించిందీ, ఒక శ్రమనే గాకుండ కూలీల మాన, ధనాల్ని కూడ వారి పశుప్రవృత్తికి ఏ విధంగాబలిచేసిందీ యీ నవల అతి సహజంగా చిత్రిస్తుంది.

ఖరీదు :- రు 3—0—0

---

# 7. ఫాంటమారా

## ఇగ్నేషియో సైలోన్

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం యూరోపులో క్రొత్తగా మొలకలెత్తిన ఫాసిజం వృద్ధిచెంది, దాని నాయకులు అధికారాలను హస్తగతం చేసుకోవటానికి ప్రయత్నించేటప్పుడు (ముస్సోలినీ వగైరాలు) దక్షిణ ఇటలీ దేశపు పల్లెల్లో ఫాసిస్టు యేజెంట్లూ, అధికారులూ యేవిధంగా ప్రజల్ని మోసగించి ఆస్తి పాస్తుల్ని దోచి, ఎన్నికల విధానాన్ని తారుమారు చేసి నానాబాధలు పెట్టిందీ, వాటిని అమాయకత్వ, అజ్ఞానాల్లోనున్న పేదప్రజలు యెలా సహించిందీ యీ నవలలో అతిసహజంగా చిత్రించబడింది.

ఓర్పు తగ్గిన తర్వాత విప్లవాని కేవిధంగా తయారయేదీ సూచించబడ్డది.

ఖరీదు : రు 2—14—0

---

# విజ్ఞాన సాహిత్య వనం

# గాంధిజం : సోషలిజం



## మొదటిభాగం

## వాదాలు — వాటి ప్రతిపాదకులు

స్వార్థరహితమైన దృష్టితో ప్రతిపాదింపబడిన ఏవాద మయినా ప్రజాహితమే అవుతుంది. ప్రజాదరణ పొందిన అన్ని వాదాలు పరార్థులయిన మహాపురుషులచేతనే ప్రతిపాదింపబడి వున్నాయి. కాని తరవాతి యుగంలో స్వార్థపరులు ఆవాదం పేరుతోనే అవకతవకలు చేసి ఆ వాదాన్నే కాకుండా, వాద ప్రతిపాదకుల పేరునికూడా కళంకితం చేస్తారు. కనక వివేకవంతుడైన విద్యార్థి అసలు వాదానికీ, ఆమల్లోవున్న వాదానికీ, వాద ప్రతిపాదకునికీ, అనుయాయునికీ వుండే భేదాన్ని గుర్తించాలి. అలా గుర్తిస్తే "పాతదికనక పనికిరా" దనే నవ్యతావాదులికిగాని "కొత్తది కనక పనికిరా"దనే ప్రాచీనతా వాదులికిగాని "పుస్తకాల్లో అలా రాయలేదుకనక వీల్లే"దనీ, "పుస్తకాల్లో రాశారుకనక అలానే వుండితీరా"లనీ వాదించే మూఢులకుగాని అవకాశం వుండదు.

ఈ వాదాలికి కట్టుబడకుండా సామాన్యపౌరుడు సుఖమయ జీవితాన్ని గడపటానికి ఎలాంటి సాంఘిక వ్యవస్థవుంటే బాగుంటుందో ఆలోచిద్దాం. గాంధిజాన్ని కాని, సోషలిజాన్ని కాని మన ఆలోచనలకి అడ్డురానియ్యవద్దు.

ఆహార నిద్రా భయ మైధునాలు పశువుకీ. మనిషికీ ఒకటే. అయినా మానవుడికి "విజ్ఞానం" అనేది ఒకటివుంది కనక మానవుడి సుఖమయజీవితాన్ని గురించి విచారించేటప్పుడు దేహానందమే కాకుండా మానసికానందాన్నికూడా గమనించాలి. కాని కేవలం దైహికం పశుత్వానికీ, కేవలం మానసికం మానవాతీతానికీ దారి తీస్తుందనే సత్యాన్ని మాత్రం మరవరాదు. అన్నవస్త్రాలికి లోటు లేకుండా చేసినంతమాత్రాన మనిషికిసౌఖ్యం కలగజేసినట్టు లెక్క కాదు. శతాబ్దాల తరబడిగా మానవుడు అలవరచుకున్న సంస్కృతివల్ల స్వతంత్రంగా జీవించటమే ప్రధానంగా ఎంచుతున్నాడు మానవుడు. అతివాదుల మనుకునే కొందరు అమాయకులు అంతర్జాతీయ దృష్టిఅనేభ్రమతో దేశభక్తినే విస్మరించి "మంచిపాలన అయితే పరపాలనఅయినా ఫరవాలే"దంటున్నారు. ఏమయినా, "నా" అనేదాంట్లో మనిషిపడే తృప్తి యితరత్రా కలగదని మన స్తత్వశాస్త్రం చెబుతోంది. కనక "నాదేశం, నాయిల్లూ, నావాకిలి, నాభార్యా, నాభర్తా, నాపిల్లలూ," అనేభావాన్ని చెక్కు చెదరనీయరాదు. ఈనాడు సంఘంలో అన్నం బట్టాలేక బాధపడేవాళ్లు కోటానుకోట్లువుంటే, "ధనాన్ని ఎలా ఇంకా ఎక్కువచెయ్యడమా? ఉన్న ధనాన్ని ఎలా భద్రపరచడమా!" అనే మానసిక వ్యధలో బాధపడేవాళ్ళు లక్షలమంది వున్నారు. ఒకవిధంగా చూస్తే శాంతియుతమైన సుఖమయ జీవితం గడపటానికీ సంఘంలో ఎవరికీ అవకాశం లేదేమో అనిపిస్తోంది.

## డబ్బు కూడబెట్టాలని మనిషి ఎందుకు కోరుతాడు ?

ముఖ్యంగా మూడుకారణాలవల్ల మనిషి యీనాటి సంఘంలో ధనం బాగా సంపాదించి కూడబెట్టాలని కోరుతాడని తెలుస్తోంది. (1) ఎక్కువ ధనంవల్ల ఎక్కువ సుఖం పొందవచ్చుననే ఆశ, (2) వార్ధక్యంలోనూ, వ్యాధులవల్ల అశక్తుడైనప్పుడూ తన జీవనం సుఖంగా నడపటానికి డబ్బు నిలవచేసుకోవాలనే ఆలోచన,

(3) తన పిల్లలు అసమర్థులయినా, అశక్తులైనా యిబ్బందిలేకుండా వాళ్లజీవితం సుఖంగా గడవటానికి ధనం కూడబెట్టి యివ్వాలనే ఆలోచన.

పై మూడింటినీ తగినవిధంగా తృప్తిపరిస్తే మానవుడి ధనార్జనాసక్తీ, తద్వారా అబ్బిన లోభిత్వం, తత్ఫలితంగా సంఘంలో ప్రబలిన దుర్మార్గం, దోపిడీలూ, హత్యలూ, యుద్ధాలూ, అవినీతీ, అశాంతీ అన్నీ అంతరిస్తాయి. డబ్బుతో పొందగలిగే సౌఖ్యానికి ఒక హద్దు ఏర్పరచడం మొదటిదానికి మందు. ఒక మనిషికి ఒక యిల్లుకంటె ఎక్కువ వుండరాదనే నియమం వుందనుకోండి— అప్పుడు ఇంకో యింటికోసం డబ్బు నిలవచెయ్యాలనే యత్నం చెయ్యడు మనిషి. జాతీయసంపదను బట్టి యీ హద్దుల్ని నిర్ణయించవచ్చు. వార్ధక్యంలోనూ, అశక్తులైనప్పుడూ జీవితాన్ని సుఖంగా నడిపే బాధ్యత ప్రభుత్వం వహించడం రెండోదానికి మందు. పిల్లల్ని మంచి పౌరులుగా తయారుచేసి, వాళ్ళు అశక్తులూ, అసమర్థులూ అయినా కూడా వాళ్ల జీవితాల్ని సుఖంగా వెళ్లదీసే బాధ్యతకూడా ప్రభుత్వం వహించడం మూడోదానికి మందు.

పై సౌకర్యాలు కలిగించటానికి శ్రమచెయ్యడం అవసరం కనక అవకాశాన్నిబట్టి సాధ్యమైనంత తక్కువపని, ఎవరికి చేతనైనది వారు చెయ్యాలనే నియమం ఏర్పరచవచ్చు. అలాంటి బాధ్యతల్ని స్వీకరించటానికి తయారయ్యే వ్యవస్థని నిర్మించటానికి, హింసావిధానం అవలంబించాలా, అహింసావిధానం అవలంబించాలా, యంత్రపరిశ్రమలుండాలా, గ్రామపరిశ్రమలే వుండాలా, రాజరికమూ, ప్రజాస్వామ్యమూ, గాంధిజమూ, సోషలిజమూ— అనే చర్చతో ప్రజాసామాన్యానికి సంబంధం లేదు.

నిష్పాక్షికమైన దృష్టితో విషయపరిశీలనచేసే రాజకీయ విద్యార్థికూడా, ఏవిధానం ప్రజాసామాన్యంకోరే సుఖమయ జీవితానికి దారితీస్తుందా అనే ఆలోచిస్తాడు. ఆ దృష్టితోనే గాంధిజాన్ని సోషలిజాన్ని పరిశీలించే ప్రయత్నంచేద్దాం.

## పెట్టుబడిదారి విధానంలో సంఘం

మున్నాట అరవైరోజులూ, ఎండనక వానసక, చెమటా నెత్తురూ ఓడ్చి, బంగారు గింజల్లాంటి ధాన్యం పండించి రాసిపోసిన రైతు, ఆరాసికే కాపలా కాస్తూ దాని పక్కనే చాలీ చాలని ముక్కునూకల గంజితాగి ప్రాణం నిలుపుకోవాల్సినగతి ఎందుకు పట్టింది? పట్టు శెల్లాలూ, పాముకుబుసంలాంటి మజిలినులూ నేసే సాలిసెట్టికి, చాలీ చాలని అతుకులగుడ్డతో మానం కాపాడుకోవాల్సిన అగత్యం ఎందుకు కలిగింది? ఆకాశాన్నంటే దివ్య భవనాలు కట్టిన కార్మికుడు ఆ భవనాల్నెవరికోయిచ్చేసి తాను, సూర్య చంద్రులు నివసించే పూరిగుడిసెలో తలదాల్చుకోవాల్సిన దుస్థితి ఎందుకు వచ్చింది? అన్నం బట్టా, యిల్లూవాకిలీ లేక కోట్లకొద్దీ "దేవుడిబిడ్డలూ" "ఈశ్వరాంశలూ" ఒకమూల అల్లాడుతుంటే ఇంకోమూల బియ్యపుబస్తాలూ, బట్టలబేళ్లూ, పెద్ద పెద్ద భవనాల్లో మురిగిపోవటానికీ ఉత్పత్తులు తగ్గించటానికీ కారణం ఏమిటి?

ఈ సందర్భంలో యీ క్రింది అంశాలు గమనించటం అసంగతంకాదు. 1931 సం॥ బ్రెజిల్‌లో 19 మిలియనుల బస్తాల కాఫీ, 1933 ఆఖరికి 22 మిలియనుల బస్తాల కాఫీ, తగలబెట్టడమో, సముద్రంలో పారెయ్యడమో జరిగింది. జర్మనీలోని పాడిఆవులు కృత్రిమపద్ధతులమీద ఎండకట్టబడ్డాయి. మెక్సికోలో ఆ త్రిపళ్లని తగలబెట్టారు.[1] 5 లక్షల గొర్రెలు 'చిల్లీ'లో మాడ్చి బుగ్గిచెయ్యబడ్డాయి. ఓడనిండా స్పానిషు నారింజకాయలు పోసుకువచ్చి ఐరిష్ సముద్రంలో కుమ్మరించి కాళీఓడ లివర్పూల్ చేరింది.[2]

---

1. P P 39,40 of "Why Swadeshi' by Agarwal, quoted in P. 310 Gandhi & Gandhism by Dr. Pattabhi.
2. P 27 Socialist Sixth of the World by the Dean of Canterbury.

టెన్నెసీలో 13,800 ఎకరాల ప్రత్తితోటని ఊసరక్షేత్రం చేశారు. న్యూయార్కులోని 'బ్యూరో ఆఫ్ స్టాటిస్టికల్ రిసర్చి' వారి లెక్కల ప్రకారం 24,00,000 మంది ఆకలిచేత చచ్చిపోయారు. 12,00,000 మంది దైన్యావస్థవల్ల ఆత్మహత్య చేసుకున్నారు.[3] హాలెండు దేశంలో అమితంగా పండిన గోధుమలకి గిరాకి లేక పోవటంచేత వాటిని పశుగ్రాసంగా మార్చారు. పశువులకే గిరాకి లేకపోయేసరికి ఆ పశుమాంసాన్ని పందులమేతగా మార్చారు. పందులకే గిరాకి లేకపోయేటప్పటికి పందికొవ్వుతో కొవ్వువత్తులు చేశారు.[4] ధనికులు తమ సరుకులు గిరాకీగా అమ్ముకుని లాభాలు జేబులో వేసుకుంటానికి అవలంబించిన చర్యలు పైవి. జి. బి. షా అన్నట్లు 'పెట్టుబడిదారీ విధానానికి హృదయంకాని, దేశంకాని లేదు.[5] ఈ సంఘంలో 'కొను చౌకలోకాని అమితప్రియంలో అమ్ము' అనే దారుణసిద్ధాంతం బయలుదేరింది. ఇది నిజంగా మానవజాతికే కళంకం, అవమానకరం. 'ఇల్లు కాలిపోయిన తర్వాత సిమెంటి కప్పులకు గిరాక. భూకంపంవచ్చిన తర్వాత ఇటుకలు గిరాక. కాని అగ్ని ప్రమాదాలూ, భూకంపాలూ, దేశసంపదని వృద్ధిచెయ్యవు' అన్నాడు రస్కిన్. 'అన్నమో రామచంద్రా!' అని కోట్లకొద్దీ జనులు అలమటిస్తుంటే కొద్దిమంది కోటీశ్వరులు వ్యాపారాలుచేసి కోట్లు నిలవచేస్తేమటుకు దేశం భాగ్యవంతమైనదని అనడంఎట్లా? లాభాలే ప్రధానమైతే "కుటుంబాదాయాన్ని ఏ విధంగానూ పెంచలేకుండా భారంగావుండే ముసలివాళ్ళనీ, పిల్లల్నీ చంపేసెయ్యడం లాభకరం. కాని అలా చెయ్యం మనం!"[6] సంఘంలోవున్న యీదుస్థితినిగురించి ప్రతియుగంలోనూ ప్రతిదేశంలోనూ పరార్థులయిన మహాపురుషులు ఆలోచించి

---

3. పే. 118 మహాత్మాగాంధీకా సమాజ్ వాద్ **by** డా॥పట్టాభి.

4. **Fenner Brockway in "Will Rcosevelt Succeed"?**
5. **P 9 Gandhian Plan by Agarwal.**
6. **Harijan D/ 10-12-38.**

ఆయా దేశకాలాలకి అనుగుణంగా కొద్దివీ గొప్పవీ అనేకమార్పులు తెస్తూ వచ్చారు.

## మహాత్మాగాంధీ—కారల్ మార్క్స

మహాత్మా గాంధీ, కార్ల్ మార్క్సు అలాటి పరార్థులయిన మహాపురుషులనే సత్యాన్ని గుర్తిస్తే వాళ్లు ప్రతిపాదించిన సూత్రాల్ని ఎంతనిశితంగా విమర్శించినా ఫరవాలేదు. "మనం మార్క్సు యొక్క గొప్పదనాన్ని నుతించవచ్చు. అంతమాత్రం చేత ఆయన ప్రతిపాదించిన ప్రతిసిద్ధాంతాన్ని అంగీకరించనక్కర్లేదు" అన్నాడు ఆచార్య కృపాలనీ. ఆసూత్రాన్ని గాంధీజీ విషయంలో కూడా వర్తింపచెయ్యొచ్చు. "రూసో వాల్టేరులు 18 వ శతాబ్దపు యుగపురుషులు, మార్క్సు 19 వ శతాబ్దపు యుగపురుషుడు. మహాత్మాగాంధీ 20 వ శతాబ్దపు యుగపురుషుడు" అన్నారు కామేశ్వరరావుగారు. నిజానికి గాంధీజీ ఓవిచిత్రమైనవ్యక్తి. ఆయన ప్రతిపాదించే విషయాలూ అంతే. "గాంధీజీలాంటి చతురరాజనీతిజ్ఞుడింకోడు లేడు" అన్నాడు బెర్నార్డ్ షా. "ప్రపంచంలో మానావు చెప్పుకోదగ్గ క్రిస్టియను ఒక్కడే వున్నాడు... ఆయనే మహాత్మాగాంధీ!" అన్నాడు ఎథెల్ మానెల్, రాష్ట్ర వెన్న అనే తన గ్రంథంలో. ఆయన 'వాంఛలు తీరని స్వేచ్ఛాజ్ఞానీ, గాయత్రిని వదిలిన కర్మిష్ఠి, గుళ్లోకన్నా వెళ్లని భక్తుడు.'[1] పక్షాల్ని ప్రేమిస్తాడు, కానిపట్టకాల్ని ద్వేషించడు. ఇంగ్లండుతో పోట్లాడుతాడు, కాని యింగ్లీషువాడితో స్నేహంచేస్తాడు. పాపాన్ని ద్వేషిస్తాడు, కాని పాపిని దూషించడు. గిల్బర్ట్ ముర్రే అన్నట్టు ఆయన ప్రమాదకరమైన శత్రువు. అతి తేలికగా ఆయన శరీరాన్ని వశపరచుకోవచ్చుగాని ఆయన ఆత్మని మాత్రం వశపరచుకోలేము.[2]

---

1. గాంధీ అభినందన్ గ్రంథ్.
2. P, 195, Gandhi & Gandhism,

## గాంధీజం అంటే ఏమిటి?

గాంధీజం అంటూ ఓ నిర్దుష్టమైన శాస్త్రంలేని మాట వాస్త వమే గాని గాంధీజీ జీవితమే ఒక శాస్త్రమైపోయింది. దాన్ని 'గాంధేయపంథా' అందాం అంటాడు కృపాలని. కాని గాంధీజం అనడమే సులువేమో ననిపిస్తోంది. కరాచీలో ఉపన్యసిస్తూ ఓ మాటు గాంధిజీయే "గాంధీ మరణించవచ్చు, కాని గాంధీజం మాత్రం చావదు" అన్నాడు. కాని 1936 లో గాంధీ సేవా సంఘసభ్యుల ఎదుట ఉపన్యసిస్తూ చెప్పినట్లు తన పేరుతో ఆయన ఒక శాఖనిమాత్రం స్థాపించి పోగొరటంలేదు. పేరు ఏంపెట్టినా గాంధీజీ ఒక విశిష్టమైన సమగ్రజీవన విధానాన్ని ప్రతిపాదిస్తున్నా డనే విషయం నిజం!

సత్యమూ, అహింసా అనేవి గాంధీజీ పేరుతో అవినాభావ సంబంధం ఏర్పరచుకున్నాయి. ఆయన తత్వంలో వ్యక్తి కేంద్రం. వ్యక్తుల కూటమే కుటుంబం. విస్తృతమైన కుటుంబమే సంఘం. కనక వ్యక్తుల ఉన్నతే సంఘోన్నతి. బ్రహ్మచర్యం, అస్వాదం, అస్తేయం, అపరిగ్రహం—యివి వ్యక్తికి సుఖాన్నిస్తాయి. వ్యక్తుల విషయంలో ప్రయోగింపదగిన అహింస వ్యక్తుల కూటమైన సంఘం లో మటుకు ఎందుకు ప్రయోగించరాదు? "నేను వ్యావహారిక ఆదర్శవాదిని" అంటాడు. మానవజీవితాన్ని ఆర్థిక, రాజకీయ నైతి కాదిరంగాల్లో గదులుగదులుగా విభజించడం తగదంటాడు. ఐనా గాంధీజం యొక్క ప్రధానాంశాల్ని 5 భాగాలుగా విభజించవచ్చు. 1 జీవితావసరాల్ని తగ్గించుకోటం. 2 ఆస్తికత్వం. 3 ధర్మకర్తృత్వ సిద్ధాంతం; 4 గ్రామపరిశ్రమలమీద ఆధారపడిన గ్రామీణనాగరికత 5 ప్రజాస్వామికంద్వారా క్రమంగా ఒకవిధమైన అరాజకం.

స్థూలంగా పై అంశాల్లో, వ్యక్తియొక్క నైతిక, మత సాంఘిక, ఆర్థిక, రాజకీయ జీవితాల ఆదర్శాలన్నీ కనిపిస్తాయి.

కాని జీవితం అంతా ఒకే ఒక అవిభాజ్యమైన సంస్కృతికనక పై అన్ని జీవితాల్లోనూ, అంతర్వాహినిగా ప్రవహిస్తూ అహింసా సత్యాలు ప్రాధాన్యం వహిస్తాయి.

## సోషలిజం అంటే ఏమిటి ?

సోషలిజాన్ని అనేక విధాలుగా అపార్థంచేయడం, మనం చూస్తున్నాం. సోషలిజంలో ఆస్తిపాస్తులుండనే వుండవనీ, వావి వరసలూ పాటించరనీ, పాపం పుణ్యం, దేవుడూ దయ్యం, మంచీ చెడ్డా అంటూ వుండవనీ ప్రతికక్షులు విమర్శించడం కద్దు. బాగా చదువుకున్నవాళ్లే సోషలిజాన్ని అనేక రకాలుగా వ్యాఖ్యానించారు. ఏది సోషలిజంకాదో కొందరు పెద్దలు చెప్పారు. 'సామ్యవాదం అంటే వ్యక్తిగత అవసరాల్లోనూ, వ్యక్తిగత జీవితంలోనూ సమానత అని అర్థంకాదు. వర్గాల్ని నిర్మూలించడమే దాని తాత్పర్యం' అన్నాడు స్టాలిన్. 'సోషజలిజం అంటే కాలేజీలోని విద్యార్థులందరికీ ఒకేరకం లాగూలూ చొక్కాలూ తొడుగుతారనీ, ఎవరికీ స్వంతపుస్తకాలు కాని, స్వంతయిల్లు కాని, స్వంతమోటారు కాని వుండవనీ మీరు అనుకోకండి.[1]

'సాంఘికంగాసమత్వాన్ని ఏర్పరచిఆసమత్వాన్ని నిలబెట్టుకోటానికిచేసే ప్రయత్నమే సోషలిజం' అంటాడు లావిలివి. ''పీడితజనుల ఆర్థికప్రణాళిక'' అని ఫాన్‌క్స్కీ ''పోటీలు పెట్టుకుంటున్న స్వంత ఆస్తుల్ని కలిపి సమిష్టి ఆస్తిగా చెయ్యడమే'' నని షాఫ్ఫల్ ''సమిష్టి ఆస్తిని ఉత్పత్తికి వినియోగించి సమానంగాపంపిణి కుదర్చటమే''నని ఫాస్నర్ రకరకాలుగా సోషలిజాన్ని నిర్వంచించారు.[1]

---

1. గాంధీవాద్ ఔర్ సమాజవాద్ పే. 156.

1. గాంధీజం, సోషలిజం, ఫాసిజం పే. 43

“ సోషలిజం అంటే ఆర్థిక ప్రజాస్వామికం ” అన్నాడు సంతానం. “ అది వర్గరహితసమాజం” అన్నాడు మహాత్మాగాంధీ.

పైనిర్వచనం ఏదీ సోషలిజాన్ని పూర్తిగా తెలపదు, కాని అన్నిటినీ కలిపితే సోషలిజాన్ని చాలవరకు నిర్వచించినట్లే ఎంచుకోవచ్చు. ఉత్పత్తి, పంపిణీ మారక సాధనాలమీద వ్యక్తుల స్వంత హక్కుల్ని నిర్మూలించి వాటిని సంఘపరంచెయ్యడమే సోషలిజంయొక్క ప్రధాన సూత్రం.

మొట్టమొదట్లో రాబర్ట్ఓవెన్ 1830 ప్రాంతాల ‘సోషలిజం’ అనే శబ్దాన్ని వాడాడు.[2] ఫోరర్ ఫ్రాన్సులో సోషలిస్టు అభిప్రాయాలికి ప్రచారం కలగజేశాడు. ఆ పేరుతో కాకపోయినా ఆభావాల్ని 18 వ శతాబ్దంలోనే గిబ్బన్, క్రీస్తుపుట్టక పూర్వం “ ప్లాటో ” యింకా పురాతన కాలంలో ఉపనిషత్కారులూ వెలుగులోకి తీసుకు వచ్చారని స్పష్టమవుతోంది గ్రంథాలవల్ల. కాని నిర్దిష్టమైన ఒకరూపంయిచ్చి శాస్త్రీయ విధానం ద్వారా ఆ ఆదర్శాన్ని జేరేమార్గాన్ని సూచించింది 1848 లో మార్క్సు ఏంజల్సు. కనక యీనాడు సోషలిజాన్ని గురించి చర్చిస్తే మార్క్సియన్ సూత్రాలే ప్రధానంగా మన దృష్టిలో వుడటం సహజం.

ఒకే ఆదర్శంగల యిద్దరు లేక అంతకెక్కువమంది వ్యక్తులుగాని, రెండు లేక అంతకెక్కువ వర్గాలు లేక పార్టీలుగాని ఎవరికి వారూ, దేనికదే నాయకత్వం వహించాలనే ఉద్దేశంతో తక్కిన వారినీ, వాటినీ దూషించడం అసహజం కాదు. ఒక్కొక్కప్పుడు ప్రజాభిమానాన్ని చూరగొన్న ఆదర్శాలికే కొందరు వ్యక్తులూ, కొన్ని వర్గాలూ, కొన్ని పార్టీలూ అంతర్యంలో వ్యతిరేకమైనా

2. P. 5 34. Glimpses of the World History By Jawaharlal Nehru.

తలుకుబడి నాయకత్వం సంపాదించటానికిగాను 'మా ఆదర్శమూ అదే!' అనటంకూడాకద్దు. సోషలిజం అలాంటి ఆదర్శాల్లో ఒకటి. ఏమైనా, కమ్యూనిస్టు మానిఫెస్టోలో 'సోషలిస్టు' అని పేరు పెట్టుకున్న యితరులందర్నీ 'అభివృద్ధి నిరోధకు' లని పిలిచారు. సోషలిజం పేరుగల రకరకాలపక్షాలూ వర్గాలూ ఎలావిమర్శింపబడ్డాయో సంగ్రహంగా విచారిద్దాం.

## 1. ఫ్యూడల్ సోషలిజం.

'కొంచెం ఏడుపు కొంచెం ఎద్దేవా భూత కాలపు ప్రతిధ్వని కొంతా, భవిష్యదుత్పాతం కొంతా- కలగాపులగం- బూర్జువాల మీద కసితీర్చుకోటానికి జమీందారులు 'పాలిటేరియను' ల (కార్మికుల) మెడ సానుభూతి చూపటం మొదలెట్టారు.- ఇదే ఫ్యూడల్ సోషలిజం.

## 2. క్రిస్టియన్ సోషలిజం.

జమీందారులూ మతగురువులూ చెట్టాపట్టాలేసుకు తిరిగే వారే కనక ఫ్యూడల్ సోషలిజంతోపాటు క్రిస్టియన్ సోషలిజం పుట్టింది. యతిత్వానికి సోషలిజం రంగు పుయ్యటం బహు తేలిక. అరంగే ఫ్రాసి మారీప్ లడ్‌లా వగైరాలు దీన్ని ప్రచారంచేశారు.

## 3. పెట్టీ బూర్జువా సోషలిజం.

ఫ్రాన్సులోనూ ఇంగ్లండులోనూ సిస్మండీ దీనికి నాయకుడు. వస్తూత్పత్తిలో పాతపద్ధతుల్ని, ఆస్తిహక్కుల్లో పురాతన సంబంధాల్ని పునరుద్ధరించాలనీ ఆధునిక ఉత్పత్తి విధానాల్ని అణిచెయ్యాలనీ చూస్తుంది. కేవలం అభివృద్ధి నిరోధకతత్వమిది.

## 4. జర్మన్ లేక 'ట్రూ' సోషలిజం.

జర్మన్ జాతే ఆదర్శజాతి అని వీరి ఉద్దేశం. కమ్యూనిజం యొక్క 'అత్యంత వినాశకరమైన విధానాన్ని' ప్రత్యక్షంగా వ్యతి

లేకిస్తుంది. ఏవిధమైన వర్గ కలహమన్నా తనకుగల 'నిష్పక్షపాత మైన అమితాసహ్యాన్ని' ప్రకటిస్తుంది.

## 5. కన్సర్వేటివ్ లేక బూర్జువా సోషలిజం.

ఆర్థికవేత్తలూ, దాతలూ, మానవసేవాతత్పరులూ, కార్మికుల స్థితిని బాగుచేయకోరేవారూ, జీవకారుణ్య సంఘాలవారూ, మితవాద ప్రచారకులూ దీంట్లోకొస్తారు. ప్రౌధన్ గారి 'ఫిలాసఫీ ఆఫ్ పావర్టీ' దీనికో ఉదాహరణం. విప్లవాత్మక తత్వాన్ని, పృథఃకరణతత్వాన్నీ మినహాయిస్తే ప్రస్తుత సాంఘికవ్యవస్థ వారికి యిష్టమే.

## 6. క్రిటికల్ యుటోపియన్ సోషలిజం

సైమన్, ఫొరియర్, ఓవెన్ మొదలైనవారి దీ రకం సోషలిజమే. కాని రాజకీయ చర్యల్ని ముఖ్యంగా విప్లవాత్మకమైన వాటినన్నిటినీ నిరాకరిస్తారు. శాంతిపద్ధతులద్వారా తమ ఆశయాల్ని పొందాలని కోరుతారు. అసలు ప్రతిపాదకులు విప్లవకారులేగాని వారి అనుయాయులు కేవలం అభివృద్ధి నిరోధకులుగా తయారయ్యారు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యక్రమంలో కూడా సోషలిస్టులని పేరుపెట్టుకున్న యితరులు యీ క్రింది విమర్శలకి గురి అయ్యారు.

రామ్సే మాక్డొనాల్డు కంపెనీవారి 'కన్స్ట్రక్టివ్ సోషలిజం' బీట్రిస్ అండ్ సిడ్నీవెబ్, బెర్నార్డుషా, లార్డు ఆలివర్ మొదలైనవారి ఫేబియన్ సోషలిజపు మితవాద దాన ధర్మతత్వాన్నీ విప్లవ వ్యతిరేకమైన బూర్జువా సాంప్రదాయాల్ని అనుసరిస్తూ కార్మిక నియంతృత్వాన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తుంది.

క్రోపాట్కిన్, జీన్ గ్రేవ్స్ మొదలైనవారి అరాజకవాదం 'రివల్యూషనరీ సిండికలిజం' ఛార్లెస్ గైడ్ అందుకోవారి 'కోఆప. రేటివ్ సోషలిజం' పెంటీ, ఆరెజ్, హాబ్సన్ అందుకోవారి 'గిల్డు సోషలిజం'—ఇవన్నీ సంస్కరణాత్మకమైన సోషలిజాలు. కార్మికవర్గాల్లోనే పనిచేస్తున్న సామ్రాజ్యతత్వపు బూర్జవాల ఏజన్సీలు"—

'సోషలిస్టు' అని పేరుపెట్టుకొన్న యితరుల సందర్భనీ వైవిధంగా దారుణంగా విమర్శించటమే కాకుండా చీనాలోని సన్‌యట్ సేనిజాన్ని, నీగ్రోలలోని గార్వేయిజాన్ని, ఇండియా లోని గాంధీజాన్ని తీవ్రంగా ప్రతిఘటించాలి' అని వ్రాయబడి వుంది.

"ఇండియాలోని గాంధీజం పూర్తిగా మత ధర్మాలతో నిండివుంది. శాగా వెనకపడిపోయి, ఆర్థికంగా బహు అభివృద్ధి నిరోధకమైన సాంఘికజీవిత విధానాన్ని ఆదర్శంగా చూపు తుంది. సాత్వికతని ప్రబోధిస్తుంది. వర్గయుద్ధాన్ని, విప్లవంపెం పొందే విధానాన్ని నిరసిస్తుంది. స్పష్టంగా అభివృద్ధి నిరోధకశక్తి గామారి పోయింది. గాంధిజంతో కమ్యూనిజం తీవ్రంగాయుద్ధం సాగించాలి."—ఇదే అంతర్జాతీయ కమ్యూనిస్టులు గాంధీజాన్ని గురించి జారీచేసిన తాకీదు.

ఇవనోవ్ అనే, కొత్తరకం కమ్యూనిస్టు యిలా అన్నాడు: "చరిత్రలో మహాపరాధులు నీరో, ఫోచ్‌లాంటి వారుకారు, గాంధీ, టాల్‌స్టాయిలాంటివారు. ఇండియాయొక్క స్వాతంత్ర్యాన్ని నిరోధించటానికి బ్రిటిషు ఫిరంగులకంటె, గాంధిగారి అంతః క్రాణే ఎక్కువ పనిచేసింది.[1]

---

1. Quoted by Masani in Page 113 "Gandhiji."

పై ఒరవడిప్రకారం భారత కమ్యూనిస్టులు వివిధదశలలో తూచా తప్పకుండావర్తించారు, వర్తిస్తున్నారు. దానిఫలితం కూడా దేశంగమనిస్తూనేవుంది. భారతదేశాన్ని సరిగ్గా అర్థంచేసుకో లేక అనేకమంది పాశ్చాత్యులు తమ అనభిజ్ఞతని ప్రదర్శించి నట్లే మార్క్సుకూడా ఇండియాని గురించి యిలారాశాడుపాపం!
"...హిందూమతం ఇంద్రియలోలుపత్వంతో కూడిన భోగవిలాసమూ, ఆత్మహింసాయుతమైన యతిత్వమూకూడాను. అది లింగ, జగ్గర్ నాట్ ల (జగన్నాధుల) మతం, సన్యాసులమతం... ఇండియాలో పురాతన గ్రామసంఘాలు ఎంత ప్రమాదరహితంగా కనిపించినా ప్రాచ్యనియంతృత్వానికి స్థిరమైన పునాదులుగా వున్నాయి. మానవమస్తిష్కాన్ని న్యూనతమమైన క్షేత్రంలో బంధించేసింది ఆవ్యవస్థ. ప్రతిఘటనారహితమైన మూఢవిశ్వాసానికి ఆకరంచేసింది. సాంప్రదాయాలికీ ఆచారాలికీ బానిసల్ని చేయడంవల్ల చారిత్రక శక్తులూ హుందాతనమూ లోపించిపోయాయి. ఈ చిన్న సంఘాలు ప్రకృతినిపూజించే అనాగరికపద్ధతిని ప్రవేశపెట్టాయి... ప్రకృతికి యజమాని అయిన మానవుడు కోతి అయిన హనుమంతుడి కాళ్లమీదా ఆవు అయిన 'శబ్బల' కాళ్లమీదా పడిస్తుతించేటంత నైచ్యానికి దిగిపోయాడు..."

పై వాక్యాలికి వ్యాఖ్యానం అనవసరం. మన దేశాన్ని గురించి విదేశీయులు వెలిబుచ్చిన అభిప్రాయాల్నే ఆధారంగా తీసుకొని సంచరిస్తే కలిగేభ్రమప్రమాదాల్ని గుర్తించాలనిమాత్రం కోరుతూ ముందుకు పోదాం.

స్థూలదృష్టితో చూస్తే గాంధీగారి అయిదు సూత్రాలికీ సోషలిజం వ్యతిరేకమూ, అనిపిస్తుంది. సర్వసాధారణంగా సోషలిజం యీ క్రింది విధంగా గాంధిజాన్ని వ్యతిరేకిస్తుందని చెప్పటంకద్దు.

1. జీవితాన్ని సుఖమయంచెయ్యటానికి సాధ్యమైనన్ని అవసరాల్ని సృష్టించుకోవచ్చు. 2. నాస్తికత్వం 3. యంత్ర పరిశ్రమలువుండితీరాలి. గ్రామపరిశ్రమలు పనికిరావు. 4. స్వంత ఆస్తులేవుండరాదు. 5. కార్మికనియంతృత్వంద్వారా క్రమంగా ప్రభుత్వమే అంతమైపోవాలి.

మానవజీవితాన్ని వివిధరంగాలుగా విభజించటానికంగీకరిస్తే పై అయిదూ నైతిక, మత ఆర్థిక సాంఘిక రాజకీయ జీవితాలలో సోషలిస్టు ఆదర్శాలని అనిపిస్తుంది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యక్రమంలో చెప్పినట్లు "బూర్జువాల దౌర్జన్యాన్ని కార్మికుల తీవ్రమైనదౌర్జన్యమే అణచగలదు." కనక అహింసకి తావేలేదు. కాని ఎలాంటిమార్పులూ లేకుండా పైసూత్రాల్ని సోషలిస్టులికిగాని, గాంధిజంయొక్క ముఖ్యాంశాలని భావింపబడే పంటూ 19 వ పేజీలో పేర్కొనబడినవి గాంధేయులికిగాని ఆపాదిస్తే వారికి అపచారం చెయ్యటమే జరుగుతుంది. ఎందుకంటే ఆత్మనిగ్రహానికీ వ్యక్తిగతమైన ఆస్తిక మతధర్మాలికీ, గ్రామ పరిశ్రమలికీ, కొన్ని హద్దుల్లో స్వంత ఆస్తికీ, ప్రజాస్వామ్యానికీ, చాలావరకు అహింసకీ సోషలిజంలో స్థానం లేకపోలేదు. అలాగే, గాంధిజంలోకూడా భౌతికసుఖాలికీ, మతవ్యతిరేకతకీ, యంత్రాలికీ, స్వంత ఆస్తుల నిర్మూలనకీ, ఒకవిధమైన నియంతృత్వానికీ, కొంత హింసకీ నిస్సందేహంగా స్థానంవుంది. తరువాతపేజీలలో సవిమర్శనగా పై విషయాల్ని పరిశీలిద్దాం.

# గాంధిజం : సోషలిజం



## II

## హింస — అహింస

హింసాహింసల నైతికమూల్యాన్ని యిక్కడ చర్చించ
దలచలేదు. కేవలం సాధ్యాసాధ్యాలూ, లాభనష్టాలూ, ఫలితం
యొక్క స్థిరత్వాస్థిరత్వాలూ— వీటిని దృష్టిలో పెట్టుకునే హింసా
హింసల విలువని నిర్ణయిద్దాం. గాంధీగారి అహింసకీ కాంగ్రెసు
అవలంబించే అహింసకీ భేదం వుందనే సత్యాన్ని గుర్తించాలి
ముందుగా. గాంధీజీ కేవలం నైతికాధ్యాత్మికదృష్ట్యా అహింసా
సూత్రాన్ని ప్రతిపాదించినా, కాంగ్రెసుమాత్రం 'వ్యవహారయోగ్య
మైనవిధానం' అనే కారణంచేతనే అహింసని అవలంబించింది. అందు
కనే "శాంతియుతమైన" అనేదానికిబదులు "అహింసాయుతమైన"
అనికాని, "సక్రమమైన" అనేదానికిబదులు "సత్యబద్ధమైన" అని
కాని మార్చటానికి కాంగ్రెసు అంగీకరించలేదు. జాతీయప్రభుత్వం
ఏర్పరిస్తే యుద్ధంలో సాయుధంగా సాయం చెయ్యటానికి అంగీక
రిస్తూ పూనాలో కాంగ్రెసువారు తీర్మానించారు. కాంగ్రెసు
వారు రాష్ట్రీయప్రభుత్వాల్ని హస్తగతం చేసుకొన్నప్పుడు శాంతి
భద్రతల్ని రక్షించటానికిగాను పోలీసు మిలిటరీ సాయాన్ని తీసుకుని
హింసావిధానం అవలంబించిన సందర్భాలెన్నో ఉన్నాయి.
"అహింస ఒక సూచిక. గమ్యస్థానం కాదు. అది ఒక వైఖరి.
సిద్ధి కాదు" [1] 'మట్టిని మట్టితో కడగలే'మని ఒకరంటే 'ముల్లుని

---

1. P. 512. Gandbi & Gandhism,

ముల్లుతోనే తప్ప తియ్యలేం" అని మరొకరంటారు. ఆ మధ్య కమ్యూనిస్టుల దౌర్జన్యాన్ని ఎదుర్కొనే విషయంలో 'అవసరమైతే ఆత్మరక్షణకి హింసాప్రయోగం చెయ్యవచ్చు' నని వ్యాఖ్యానించారు గాంధీజీ శిష్యులే. "బ్రిటిషువారితో యుద్ధం చెయ్యటానికే తప్పితే మిగతా విషయాలికి కాదు అహింస" అనేవారు కాంగ్రెసులోనే ఎంతోమంది వున్నారు.

గాంధీజీయే హింసాహింసల విషయమై యిలా అన్నాడు- "...జీవితంలో ఏదోరకంగా హింస కొంత యిమిడివుంది. మనం సాధ్యమైనంతవరకు తక్కువ హింసను స్వీకరించాలి.[1] పిరికితనం, హింసా- ఈరెండిటిల్లో ఏదోఒకదాన్ని స్వీకరించాలివస్తే హింసనే స్వీకరించవలసిందిగా నేనుసలహాయిస్తాను[2] ఇతరుల్ని చంపకుండా ధైర్యముతో తాను చనిపోయే శక్తి లేనివారికి 'చంపవలసినదే' నని నా సలహా.[3]

'దేశంయొక్క ఆశయం అహింస కాదనీ, స్వరాజ్యసంపాదన అనీ నాకు తెలుసు. విదేశ అత్యాచారుల పాదాలకింద బానిసలుగా కట్టబడి వుండడంకన్న హింసతోనన్నా దేశం స్వతంత్రం అయ్యేటట్టు చూస్తా.[4] అసమర్థతను కప్పేసేందుకు అహింస అనే ముసుగుల్ని ధరించడంకన్న మన హృదయాల్లో హింసవుంటే హింసాయుతంగా ప్రవర్తించడమే మంచిది. పిరికితనంగా తన అవమానాన్ని చూస్తూ నిస్సహాయంగా సహించడం కన్న తన గౌరవాన్ని రక్షించుకోటానికి భారతదేశం ఆయుధాన్ని పట్టడమే నయం.[5]

1. హరిజన్ 28-9-34
2. P. 47 Mind of Mahatma Gandhi
3. P. 78 Gandhi & Gandhism
4. Quoted by Romain Rolland in P.45 "Mahatma Gandhi"
5. P. P. 60 and 67 "Gandhiji's Beads of Wisdom."

1934 సెప్టెంబరులో గాంధీజీ యిలా రాశాడు : "14 ఏళ్ల దీర్ఘప్రయోగానంతరం కాంగ్రెసులో అధికసంఖ్యాకులికి అహింస ఒక విధానం మాత్రంగానే వుంది."

ఒకమాటు కొందరు మార్క్స్యవాదులు గాంధీజీతో సంభాషించినప్పుడు "హింసావిధానంవల్లనే మీ ఆశయం నెరవేరుతుందని మీరు నమ్మేటట్లయితే హింసావిధానం అవలంబించడమే మీ ధర్మం" అని చెప్పాడు. తన ఆశ్రమంలో ఘోరవ్యాధిచే బాధపడే ఆవుదూడను చంపించి 'అది హింసకిందికి రాద'ని చెప్పాడు గాంధీజీ. ఆశ్రమపు పంటలు పాడుచేసే కోతుల్ని పారదోలే విషయంలో కూడా హింసాహింసల చర్చ కొంత నడిచింది.

కనక గాంధీగారి అహింసకీ, కాంగ్రెసువారి అహింసకీ ఎన్నదగిన భేదంవుందనీ, గాంధీగారి అహింసే వివిధపరిస్థితులలో విచిత్రమైన నిర్వచనాలకి తావిస్తుందనీ అర్థమవుతోంది. బోయరు యుద్ధంలోనూ, 1914-18 ప్రపంచ సంగ్రామంలోనూ గాంధీజీ వహించిన పాత్ర, గత యుద్ధంలో జెక్కులికి ఆయనయిచ్చినసలహా, యీ సందర్భంలో గమనించాలి. అటువంటప్పుడు అతివాదులమని చెప్పుకునేవారు యితరుల్ని "ఆచరణయోగ్యంకాని అహింసావాదు"లనిగాని, గాంధేయులమని చెప్పుకునేవారు యితరుల్ని "ప్రమాదకరమైన హింసావాదు" లని గాని దూరంచెయ్యచూడటం వివేకంకాదు.

హింసయొక్క గర్భంలోనుంచే ప్రతీకారేచ్ఛపుడుతుంది. దాన్ని ఎదుర్కోటానికి మరింత హింసచెయ్యాలి. "అదొక విషవలయం. దెబ్బ కోపాన్ని కలిగిస్తుంది. కోపంవల్లా దెబ్బకి దారితీస్తుంది. అహింస ఒక అమృతవలయం. సేవ, సహృదయతని పెంపొందిస్తుంది. సహృదయత సేవని యినుమడింప జేస్తుంది."[1]

1. P. 136 Gandhi & Gandhism

సాయుధ విప్లవంలోకంటే, ప్రతివిప్లవాన్ని అణిచేటందుకే ఎక్కువ రక్తపాతంచెయ్యాలి వస్తోందని చరిత్రచెబుతోంది. సోషలిజాన్ని గురించి రాస్తూ టాల్‌స్టాయి "హింసావిధానంలో పాల్గొన నిరాకరిస్తూ నైతికచట్టాన్ని ఒక్కవ్యక్తి అనుసరించినా, ఆయన్ని హింసించి, ఖైదులోపెట్టి, ఆఖరికిచంపివేసే లక్షలాదిజనంకంటే ఆఒక్కడే ఎక్కువ శక్తివంతుడు" అన్నాడు. "విద్వేషాన్ని ప్రేమతోనూ చెడుగును మంచితోనూ జయించగలం" అన్నాడు లాస్కీ. అదీగాక యీ 'యాటంబాంబు' యుగంలో యిండియాలాంటిపరాధీనదేశం హింసావిధానంద్వారా రవి అస్తమించని బ్రిటిషుసామ్రాజ్యాన్ని ఎదుర్కొనగలుగుతుందనుకోటం భ్రమ. ప్రజాసామాన్యంలో విప్లవశక్తి నికేంద్రీకరించాలంటే సత్యాగ్రహంలాంటి 'బహిరంగపు కుట్ర' పనిచేస్తుందికాని రహస్య హింసావిధానం ఎంతమాత్రం పనికిరాదు.

సాధనా, సిద్ధీ పర్యాయపదాలు గాంధీజీ దృష్టిలో. సాధన అంటే పరిణతిపొందని సిద్ధి. సిద్ధి అంటే పరిణతి పొందినసాధన. బీజంలోనే వృక్షంవున్నట్లు సాధనలోనే సిద్ధి యిమిడివుంటుంది. కాని యితరులదృష్టిలో 'సాధనయొక్క మంచిచెడ్డలు సిద్ధివల్ల నిరూపించబడతాయి'. ఇప్పుడు హింసావిధానంతో స్వరాజ్యంవచ్చినా గాంధీజీకి యిష్టంలేదు. కాని యితరులెవరూ ఆ స్వరాజ్యాన్ని అక్కర్లేదనరు. ఇప్పుడు గాంధేయులమని చెప్పుకునేవారుసైతం ఆ స్వరాజ్యాన్ని తిరస్కరించరు. కనక గాంధీగారి రాజకీయ నాయకత్వం అంగీకరించినవారిలో కుడిపక్షంవారు ఎంత అహింసావాదులో వామపక్షంవారూ అంతే అహింసావాదులు. ఎవరూ కూడా హింసని ప్రోత్సహించడంలేదు. హింసవల్లనే ఏదన్నా ప్రయోజనం సిద్ధిస్తే, దానికి వెరచేదిలేదు. కనక కాంగ్రెసు రాజకీయాల్లో హింసాహింసల చర్చకే తావులేదు.

# గాంధిజం : సోషలిజం



## III

## 1. జీవితావసరాల్ని తగ్గించుకోటం

గాంధీజం ప్రతిపాదిస్తుందని సాధారణంగా భావించే పంచ సూత్రాల్ని ఒక్కొక్కటిగా పరిశీలిద్దాం. నిగ్రహంలోనే ఆనందం వుందని తత్వవేత్తలు చెబుతారు. ఆ దృష్టితోనే గాంధీజీ "సంయమా"న్ని ప్రబోధిస్తున్నాడు. కాని వ్యావహారిక ఆదర్శవాదినని చెప్పుకునే గాంధీజీ వాస్తవికతను గుర్తించలేకపోలేదు. "అన్నం లేనివాడి ఎదుటికి దేవుడుకూడా గుప్పెడు మెతుకులు తీసుకునే ప్రత్యక్షమవ్వాలి"అనిఅన్నాడు. అందుకనే బీదవాడి బీదరికాన్ని అలాగే వుంచటానికే గాంధీగారి యీ సంయమవాదం ఉద్దేశింప బడిందనడం కాని "నేను దరిద్రనారాయణ సేవకుడిని" అని ఆయన అంటే "గాంధీగారి రాజ్యంలో దరిద్రులుండితీరాలని కావాల్సు ఆయనలాటివాళ్లచేత సేవ చేయించుకోటానికి" అని విమర్శించడం కాని భావ్యంకాదు.

జీవితాన్ని సుఖకరం చేసుకోటానికి సాధ్యమైనన్ని అవస రాల్ని పెంచుకోవచ్చునని సోషలిస్టులంటారు. కాని అందరికీ సాధ్యమైనంతవరకు సమాన సుఖాలే వుండాలిగదా! కోరికల్ని పెంచు కోటంకంటె చంపుకోటం కష్టం. అంతులేని కోరికల్ని ప్రజలలో రేకెత్తించి అందరి అన్ని కోరికల్నీ సఫలం చేయడం ఏ ప్రభుత్వా

నికీ సాధ్యంకాదు. ప్రతిపట్టణంలోనూ పది అంతస్థుల మేడలు కట్టుకొని నిరంతరం విమానంలో ప్రపంచయాత్ర చేస్తూవుండాలని కోరుతూవుండే మానవుడు. అలాంటి కోరికల్ని అందరూ సఫలం చేసుకునేటట్లు చెయ్యడం సాధ్యంకాదు. కనుక కోరికలు తగ్గించుకోటమే ఆదర్శంగా చూపించి దేశసంపదనుబట్టి భోగవాదపు అంతస్తుని క్రమంగా హెచ్చించడం వివేకమైన పని. దానికే గాంధిజీ ఆధ్యాత్మిక నైతిక వాతావరణాన్ని కల్పించి ప్రజల ముందు పెట్టాడు. అదీకాక భౌతిక సౌఖ్యావకాశాలు చాలా తక్కువగావున్న ఇండియావంటి దేశాల్లో అవసరాల్ని హెచ్చించుకోటమనే భోగవాదం కంటె తగ్గించుకోవాలనే సంయమవాదమే ప్రయోజనకరం.

ఎంత మంచి సిద్ధాంతమైనా హద్దులు దాటించి అన్వయిస్తే ప్రమాదమే కలుగుతుంది. రాజకీయాల్లో పనిచేసే ప్రతివ్యక్తినీ గాంధిగారి ఆధ్యాత్మిక నైతికపు కొలమానంతో కొలవడం అలవాటైపోయింది. గాంధీజమట్టుకు బహుజాగ్రత్తగా వ్యక్తుల అంతరాన్ని గుర్తించాడు. అందుకనే తన ఆశ్రమవాసులికి నిర్ణయించిన కార్యక్రమం, శిక్షణా కాంగ్రెసుముందు పెట్టనేపెట్టడు. బుద్ధుడికి కూడా రెండురకాల శిష్యవర్గం వుండేది యిలాగే.

జర్మనీవాడుగాని, జపానువాడుగాని, ఇంగ్లీషువాడుగాని అవసరంవచ్చినప్పుడు అతిసునాయాసంగా ఫిరంగి గుండుని ఎదుర్కొనగలడు. అతను నాట్యశాలనుంచో, హోటలునుంచో, బిలియర్డ్సుగదినుంచో సరాసరి యుద్ధరంగంలోకెళ్ళగలడు. వెళ్తాడు.[1] కాని భారతదేశంలో దేశభక్తుడు ఎలాంటిభోగాల్నీ ఆశించరాదు. యతిలక్షణాలుండాలి అతనికి. 'సినిమాలుచూడరాదు. సిగరెట్లు తాగరాదు. క్రాఫ్ వేసుకోరాదు' అనేటంత విషమ పరీక్షచేస్తారు ప్రజలు మనదేశభక్తుడిని. అందుకనే దేశసేవకైనే వాళ్ళల్లో బూటకం ఎక్కువైంది. ఈ ధోరణితగ్గాల్సిన అవసరం ఎంతోవుంది.

1. P. 154 Gandhian way.

# గాంధిజం : సోషలిజం



## IV

## 2 ఆస్తికత్వం

మతం అనగానే దేవుడు కూడా వస్తాడు తప్పనిసరిగా. మతం పేరుతోనూ దేవుడి పేరుతోనూ, మతస్థులు చేసిన దారుణాలూ ప్రజాసామాన్యాన్ని దోచుకుంటానికి ధనికులు మతాన్ని ఉపయోగించుకున్న విధానాలూ చూస్తే అభ్యుదయవాదులు అసలు మతాన్నే, దేవుడినే ఏవగించుకోటం సహజమేననీ క్షంతవ్యమేననీ అనిపిస్తుంది.

"మార్క్సిజం నీతినీ మతాన్నీ రూపుమాపుతుంది. కనక కాథలిక్కులు వామపక్షానికి ఓటిస్తే పరలోకంలో యమయాతనలకి గురిఅవుతారు" అని పోపు చెప్పినట్లు మాస్కో రేడియో ప్రకటించింది.[1] —మతాన్ని స్వార్థానికి ఉపయోగించుకున్న అత్యాధునిక తార్కాణంయిది. అయినా ప్రజాసామాన్యానికీ, అందులోనూ భారతదేశ ప్రజాసామాన్యానికి మతంమీదా దేవుడిమీదా విశ్వాసం చలించలేదు. వ్యక్తుల ఆస్తిక్యనాస్తిక్య భావాల్ని అరికట్టడం అసాధ్యం. అటువంటప్పుడు ప్రజాసామాన్యాన్ని నడపటానికి గాంధీజీ లాంటి మతస్థుడికే ఎక్కువ అవకాశంవుందనే సత్యాన్ని గుర్తించకతప్పదు. మతాన్ని రాజకీయాల్లోకి తీసుకురారాదనే నినాదంలో అర్థంలేదనటానికి వీలులేదు కాని, గాంధీగారి మతాన్ని

---

1. National Herald. D/ 4-6-1946

దేవుడినీ జాగ్రత్తగా అర్థంచేసుకుంటే ఆయన మతం, ఆయనదేవుడూ భారతరాజకీయ పురోగమనానికి అడ్డు తగలవనీ అమతస్థునికీ నాస్తికునికీకూడా తావిస్తాయనీ తెలుస్తుంది.

## గాంధీగారి దేవుడు ఎవరు ?

గాంధీజీ యిలా అన్నాడు "......సత్యంకంటె వేరే గొప్ప దేవుడులేడు.... నా ఉద్దేశంలో మతస్థులంతా రాజనీతిజ్ఞులే. నేను మాత్రం రాజనీతిజ్ఞుని వేషంలోవున్న మతస్థుడిని"... మతమంటే ప్రపంచాన్ని నడిపే క్రమబద్ధమైన నైతిక ప్రభుత్వంయందు నమ్మకం [1] "దేవుడంటే సత్యం,నీతి, అభయం". గాంధీజీమతానికి భౌగోళికహద్దులులేవు. ఇండియాయెడ ఆయనకు గల ప్రేమని కూడా ఆయన మతందాటి పోవచ్చు.[2] F. R. మొరేస్ ఒకచోట "మతవిహీనమైన రాజకీయాలు నాకులేవు" అని గాంధీజీ అన్నట్టు రాశాడు. ఆకలితో పీడింపబడుతూ సోమరిగా పడివుండే ప్రజలఎదుటికి 'భోజనం; పని' అనే రూపంతోమాత్రమే ప్రత్యక్షమవటానికి దేవుడు సాహసిస్తాడు. [3] 'నా ఏకైకలక్ష్యం ముక్తిని పొందటం. ఈఆశయంతోనే నేను రాజకీయరంగంలో కొచ్చా' నన్నాడు గాంధీజీ. ముక్తిపొందదలుచుకున్నవారు అరణ్యాల్లోకో, కొండ గుహల్లోకో వెళ్లుతారుగాని రాజకీయ రంగంలోకిరారు. కాని గాంధీజీయొక్క ముక్తి ప్రజా సేవలోనేవుంది. ప్రార్థన సమయంలో ప్రేక్షకులచేత రామభజన చేయిస్తాడు. నిజమే. కాని కురాన్, బైబిల్, జెండవెస్తాల్లోంచికూడా పఠనలు చేయిస్తాడు. ఎంత మతస్థుడైనా, మతంపేరుతో జరిగే దౌష్ట్యాన్ని, దోపిడినీ ఎంత

---

1 P. 71. Mind of Mahatma Gandhi.

2 Romain Rolland in "Mahatma Gandhi"

3 Quoted in Page 47 Gandhiji.

మాత్రం సహించడు. హరిజన దేవాలయ ప్రవేశోద్యమమే దీనికి ప్రబల నిదర్శనం. మొదట్లోనే చెప్పినట్లు ఆయన 'గాయత్రిని ఒదిలిన పక్ష్మిక్ష్మి, గుళ్లోకన్నా వెళ్లని భక్తుడు.'

'గాంధీజం ఒక విశిష్టమయిన విధానం. మతంలోనూ వేదాంతంలోనూ పుట్టుక, ఆర్థిక రాజకీయాల్లో నడకా, ఆధ్యాత్మికోపలబ్ధి గమ్యస్థానం'.[1] ఆయన ఆదర్శరాజ్యం రామరాజ్యం. పాపం అమాయకులు కొందరు ఆయన రామరాజ్యంలో శంబుక వధలూ, అవీ వుంటాయనుకుని భయపడుతున్నారు. నిజానికి ''రామరాజ్యం విశిష్టమైన ప్రజాస్వామికం. దాంట్లో ఆ స్త్రీమీదా, రంగుమీదా, కులమతాలమీదా, లింగభేదాలమీదా ఆధారపడే హెచ్చుతగ్గులు మటుమాయమైపోతాయి. భూమీ ప్రభుత్వమూ ప్రజలవయి పోతాయి''[2] నైతిక మతోపదేశాల్ని మానవుడు జీర్ణింపచేసుకుంటే సాంఘికనిర్మాణపు పునాదుల్లోనే బ్రహ్మాండమయిన పరివర్తన కలుగుతుంది. సోషలిస్టు ఉపదేశాలు సంఘం యొక్క బహిర్నిర్మాణాన్ని మాత్రమే మారుస్తాయి.[3] కనకనే గాంధీజీ మత వాతావరణాన్ని నిర్మూలించడు.

వ్యావహారికదృష్టితో చూసినాకూడా మతాన్నీ దేవుడినీ గురించి అనుకూలంగా మాట్లాడితేనో, లేక కనీసం తటస్థంగా ఉంటేనో తప్ప అమాయకజనంలోకి ప్రవేశించలేమనే సంగతి యీసరికి అతివాదులు గుర్తించి వుండాలి. మతాన్నీ దేవుణ్నీ కొట్టి పారేయాలనే అతివాద వర్గాలూ, కొద్దోగొప్పో దాన్ని అమలులో పెట్టినదేశమూ, యీవిషయంలో ఏమంటున్నాయో చూద్దాం.

సోషలిస్టు అయినవాడు మతాన్నీ దేవుడినీ నిరసించాలని ఎక్కడా చెప్పబడలేదు. ''మతం మత్తుమందు'', ''అది మన

---

1. Gandhism—a *Socialistic Approach*.
2. 22-6-1945
3. Tolstoi on *Socialism*

పార్టీలో ముళ్ళకంప" అని కొందరు సోషలిస్టులనడం నిజమే. మతానికి దేవుడికీ స్వస్తి చెప్పారనుకునే రష్యాలో స్థితినిగూర్చి రాస్తూ డీన్ ఆఫ్ కాంటర్బరీ "విశ్వాసంలోనూ క్రమశిక్షణలోనూ ఆశయం యొక్క ఏకైకతలోనూ కమ్యూనిస్టుపార్టీకి క్రైస్తవ రాజ్యపు మతాలకు పోలికలు చాలావున్నాయి.[1] రష్యాలో యీనాడు మతస్వాతంత్ర్యం లేదనడం సంపూర్ణంగా అబద్ధం. మతప్రచారానికి రేడియోలూ వార్తా పత్రికలూ అవకాశం యివ్వకపోవటం వాస్తవమే అయినా 50,000 మంది పురోహితులీనాడు రష్యాలో వున్నారు.[2] ఈ రోజున సోవియట్ యూనియన్‌లో 30,000 మతసంఘాలున్నాయి. 8,338 క్రైస్తవ దేవాలయాలున్నాయి. అనేక మసీదులున్నాయి. చర్చిల్లో దైవారాధనే కాకుండా పిల్లలకు పేర్లుపెట్టటం, వివాహాలు జరపటం, పండుగలు చెయ్యడం, ఉపవాసాలుండటం, అంత్యక్రియలు జరపటం—యిత్యాది కర్మకాండకూడా వుంటుంది[3] కాని మతాన్ని దేవుడిని నిర్మూలించటానికి రష్యాలో తీవ్రచర్యల్ని తీసుకున్నారనడం మాత్రం నిజం. మఠాల్ని విచ్ఛిన్నం చేశారు. వాటికిచెందిన భూమినంతా లాక్కున్నారు. చాలామంది సన్యాసులు చెదరగొట్టబడ్డారు. క్రీస్తుకి వ్యతిరేకమనే భావంవల్ల చర్చిభూముల సంబంధమైన కంట్రాక్టుల మీద సంతకం పెట్టటానికి నిరాకరించిన సన్యాసుల్ని ప్రవాసం పంపారు. పాఠశాలల్లో మతబోధ చెయ్యటానికి వీలులేదు. 5గురి కంటె ఎక్కువమందిని ఒకచోట చేర్చి మతబోధ చేయరాదు.[4] అయినా కూడా 'ఈనాడు రష్యాలో నాకు కమ్యూనిస్టు క్రిస్టియన్లు కనిపిస్తున్నారు' అన్నాడు డీన్ ఆఫ్ కాంటర్బరీ. గోర్కీని టాల్

---

1. P 106 Socialist sixth of the world
2. P 134 " "
3. పే. 198 నేటి సోవియట్ యూనియన్.
4. P P 142, 143 Life under Soviets by Alexander Wicksteed

స్టాయి ప్రశ్నిస్తే “నాకు దేవుడియందు నమ్మకములే”దని జవాబు చెప్పాడు గోర్కీ. కాని టాల్‌స్టాయి “నేను మీమాటనమ్మను. మీ జీవితమే చెబుతోంది మీకు దేవుడంటే నమ్మకం వుందని. మీరు రాసే ప్రతివిషయమూ నాకా విషయాన్నే తెలియజేస్తోంది” అన్నాడు.[1] కనక చేసేచేతలు ప్రధానం గాని, మాటలు కావు.

నాస్తికత్వం పూర్తిగా తలకెక్కిందనుకునే రష్యాలోనే సంస్కృతులిలా వుంటే ఆస్తికత్వానికి తలమానిక అనుకునే భారతదేశం లాంటి, మతాచారాలతో నిండిన అత్యాచారాల్ని, మూఢవిశ్వాసాల్ని పూర్తిగా ఖండించే గాంధీగారి మతాన్ని కూడా సైరించక పాటించటం ఉచితమైనా కాకపోయినా అసాధ్యం అని మాత్రం ఒప్పుకోక తప్పదు.



---

1. P 134 Socialist *Sixth* of the World

# గాంధిజం : సోషలిజం



V

## 3. ధర్మకర్తృత్వ సిద్ధాంతం

"గాంధిజానికీ సోషలిజానికీ మిగతా అన్ని విషయాల్లోనూ సమన్వయం కుదురుతుందేమోగాని, ధర్మకర్తృత్వ సిద్ధాంతంలో సరిపడదు" అంటాడు స్వామి సంపూర్ణానంద్.[1] 'అహింసా యుతంగా ఆర్థికసమత్వంచేకూర్చాలంటే యిదే మార్గం, అంటారు గాంధీయులు. స్వంత ఆస్తివుండనే రాదంటారు సోషలిస్టులు. కాని ఆచరణలో కొంతవరకు స్వంతఆస్తిని అంగీకరిస్తారు సోషలిస్టులయినా. నిజానికి గాంధిగారి ఆదర్శంకూడా అపరిగ్రహం అస్తేయమూను. అంటేస్వంతఆస్తి నిర్మూలనమన్నమాటే. "ఆస్తిని కలిగివుండటం మహాపరాధమని నాఉద్దేశం" అన్నాడు గాంధీజీ.[2] ఆస్తిపరుడు తానొకధర్మకర్త అని, ప్రజలక్షేమానికే తన ఆస్తిని వినియోగించాలని ఎంచాలి. తన స్వంతలాభంకోసం, సౌఖ్యంకోసం యిష్టంవచ్చినట్లు ఆస్తిని వినియోగించరాదు.—ఇదే ధర్మకర్తృత్వ సిద్ధాంతం. ఇది ఒక సాధనేకాని ఆదర్శంకాదు. ఇంతకన్న ఉత్తమమైన అహింసా సాధనంవున్నా, లేక అహింసా పద్ధతులద్వారా, ఆస్తిపరులు వారంతట వారే తమ ఆస్తుల్ని త్యజిం

---

1. గాంధీవాద్ ఔర్ సమాజవాద్.

2. **Gandhi & Gandhism;**

చినా, యీ ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని గాంధీజీ వదులుకుంటాడు.

"నేను ఊహించే ధర్మకర్తృత్వ సిద్ధాంతం, తన విలువని యింకా ఋజువుచేసుకోవాల్సివుంది. సమర్థులైన వారి ద్వారా ఆస్తుల్ని చక్కగా ప్రజల శ్రేయస్సుకోసం వినియోగింప చెయ్యటానికి ధర్మకర్తృత్వ సిద్ధాంతం ఒక యత్నం" అన్నాడు గాంధీజీ.[1] ఆయన స్వంతఆస్తి విధానానికి అంగీకరించటానికి కారణం దాని యందు ప్రేమవుండిగాని, అలాంటివిధానం మానవ పురోభివృద్ధికి అవసరమని భావించిగాని కాదు. శాంతి అహింసాపద్ధతుల ద్వారా స్వంతఆస్తి విధానాన్ని నిర్మూలించటానికి తగిన పద్ధతి ఆయన యింకా కనిపెట్టాల్సివుంది.[2] అదే ఆయన స్వంతఆస్తి విధానానికి అంగీకరించటానికి కారణం. "కోటీశ్వరుడు తన కోట్ల ధనాన్ని వుంచుకోవచ్చు. కాని, ప్రజలకుగానే తనదగ్గర వుంచుకోవాలి. ప్రజాహితంకోసం అవసరమైనప్పుడు ప్రభుత్వం ఆ ధనాన్ని వశపరచుకోవచ్చు" అన్నాడు గాంధీజీ.[3] స్వంతఆస్తి వుండరాదనే సిద్ధాంతం, అపరిగ్రహం అస్తేయం అనే నైతికాదర్శాల్ని ఆర్థిక జీవితంలో అన్వయించడమే.[4] లూయీఫిషర్ కి జవాబిస్తూ 'భూస్వాములకి పరిహారం యివ్వడం ఆర్థికంగా ఎవరికైనాసరే అసాధ్యమైన పని' అన్నాడు గాంధీజీ.

ఇంత స్పష్టంగా చెప్పినాకూడా తెలిసో తెలీకో ఆయన్ని విమర్శించేవారు వుండనేవున్నారు. హృదయపరివర్తన సిద్ధాంతాన్ని హేళన చేస్తూ "హృదయమే లేని వాళ్ళకి పరివర్తన

---

1. Gandhiji in Harijan D/ 20-2-37.
2. Kishorilal Mashruwala in Harjan D/ 5-12-36
3. P. 127 Mind of Mahatma Gandhi
4. P. 126 ,, ,, ,,

ఎక్కడ?" అనటం వింటున్నాం. "ప్రతికి మేకవిషయమై హృదయపరివర్తనకలుగుతుందా?" అని ప్రశ్నిస్తారు. అహింసా సూత్రం ప్రకారం దుర్మార్గుడికికూడా ఒక అవకాశం ఇవ్వబడుతుంది. ఆఅవకాశాన్ని వినియోగించుకోకపోతే తరవాతచూడ్క వుండనేవుంది. "అహింసా విధానం ద్వారా ధనిక వాదాన్ని నాశనం చెయ్యగోరుతున్నాం. కాని కార్మికుడు తన యజమాని మనస్సు మారేదాకా చేతులు కట్టుకుని కూర్చోనక్కరలేదు" అన్నాడు గాంధీజి.[1]

"ఆస్తిలేనివారు తమశక్తినిగుర్తించి 'వీల్లేదు' అని కచ్చితంగాచెప్పే ఆత్మబలాన్ని సంపాదించుకున్న వెంటనే ఆస్తిపరుల హృదయ పరివర్తన దానంతట అదే సిద్ధిస్తుంది." అని మహాదేవ దేశాయి చెప్పాడు.[2] గాంధీజీ ఒప్పుదల పొందిన "గాంధియన్ కాన్స్టిట్యూషన్" అనే పుస్తకంలో "స్వతంత్ర భారతదేశంలో భూమి అంతా ప్రభుత్వానికి చెందుతుంది, జమిందారీ విధానం అంతరిస్తుంది." అని రాయబడివుంది. ప్రజాస్వామికం పార్లమెంటులోనూ, సోషలిజం కమ్యూనిస్టు పార్టీలోనూ చచ్చిపోవటంచేత గాంధీజీ, సంస్థలమీదకంటె వ్యక్తులమీద ఎక్కువ విశ్వాసంచూపుతున్నాడు.[3]

స్వంత ఆస్తి విధానాన్ని నిర్మూలించాలనేవారు యీ విషయమై ఏమి చెబుతున్నారో యిహ విచారిద్దాం. కమ్యూనిస్టు యింటర్నేషనల్ ప్రోగ్రాంలో స్పష్టంగా యిలా చెప్పబడివుంది. "...భూమిమీద స్వంతఆస్తి హక్కుల్ని సంపూర్ణంగా నిర్మూలించడంగాని, భూమినంతా ప్రభుత్వపరం చెయ్యడంగాని, పెట్టు

1. P. 116 Mind of Mahatma Gandhi,
2. M. D in Harijan D/ 3-2-38
3. Dant wala in "Gandhiji' Page 121

బడిదార్ విధానం బాగా వృద్ధిపొందిన దేశాల్లో వెంటనే జరుగ జాలదు. ”

‘చిన్నరకం మధ్య రకం వ్యాపారాలు, చేతి పరిశ్రమలు, చిన్నరకం మధ్యరకం పొలాలు, చిన్న పరిశ్రమలు— వీటికి సంబం ధించినంతవరకు ఉత్పత్తిని ప్రభుత్వపరం చెయ్యాలనే సూత్రం వర్తింప చెయ్యరాదని నియమం ఏర్పరుచుకోవాలి.’ స్టాలిను ఒక చోట యిలా రాశాడు. ‘ బుద్ధితో పనిచేసే కార్మికులూ, శరీరంతో పనిచేసే కార్మికులూ కలిసివుండే ఫ్యాక్టరీలలోని కమ్యూనుల్లో కూడా కార్మికులు తమ తమ జీతాల్ని ఉమ్మడి కాతాలో జమకట్టి తరువాత సమానంగా పంచుకోవాలనే సూత్రాన్ని వర్తింపచెయ్యా లని తలపెట్టారు మన అతివాద దద్దమ్మలు.’ నైపుణ్యంగల కార్మికు లున్నారు. వారికి ఉత్పత్తిలో ప్రముఖస్థానంవుంది. సమానంగా పంచుకమంటే వారిని శిక్షించడమన్న మాట. ’ (పే. 59. మార్క్సిజం అంటే ఏమిటి? By ఎమిలీ బరన్స్.) కారల్ మార్క్స్ ఉపదేశాల్లో యిలా రాయబడివుంది ‘‘చిన్న చిన్న ఆస్తిపరుల విషయంలో పనిచేయ్యాల్సింది యిది: మొట్టమొదట్లో వ్యక్తిగత ఆస్తినీ, ఉత్పత్తినీ సహకార స్వామ్యంగానూ, సహకారోత్పత్తిగానూ మార్చాలి. అయినా బలవంతాన కాకుండా, ఉదాహరణలు చూపించీ సాంఘిక సాయం చూపించీ వారిచేత ఒప్పించాలి.’ ‘పనిలో వ్యక్తిగతమైన బాధ్యత లేకపోవటాన్ని, వేతనాన్ని సమానం చేయటాన్ని నిర్మూ లించాలి’ అన్నాడు స్టాలిన్. [1]

పై సూత్రానికి విరుద్ధంగా ‘ కొనడంవల్లనో లేక పరిహారం యిచ్చేవిధానంవల్లనో నెరవేరేపనిని, బలవంతంగా వశపరచుకొని నెరవేర్చడం జరిగింది.[2] అందుకనే అంత రక్తపాతం జరిగింది రష్యాలో.

1 P. 7 ‘On organization’ by Stalin,
2 P. 53 Social'st sixth of the World,

ఆదర్శం అనేది ఎప్పుడూ వ్యవహారానికి దూరంగానే వుంటుంది. ఒక ఆదర్శంజేరితే దానికి మించింది యింకొక ఆదర్శంగా తయారవుతుంది. స్వంతఆస్తి వుండరాదనేది గాంధీజంలోనూ సోషలిజంలోనూ ఆదర్శాలే. ప్రస్తుతం మానవుడు పెరుగుతూ వచ్చిన పరిస్థితుల్లో 'నా' అనేది లేకపోతే అతడు తన శక్తియుక్తుల్ని పూర్తిగా వినియోగించి పనిచెయ్యటానికి ఉత్సాహం చూపడు. జమీందారు తన స్వంతకమతాల్లో పాలేరుల్ని పెట్టి సేద్యం చేయిస్తాడు. పాలేర్లు తమ స్వంతభూముల్నికూడా సేద్యం చేస్తారు. ఆ రెండుభూముల పంటలకీగల వ్యత్యాసం ప్రతివారూ యిట్టే కనిపెట్టవచ్చు. స్వంతభూమి విధానాన్ని నిర్మూలించేసరికి రష్యాలో రైతులు తమ గొడ్లను చంపుకుకూర్చున్నారు. పంటలో చాలా తరుగుదల కనిపించింది. తన శక్తినీ పరిశ్రమనీ గుర్తించి ఇంతవరకన్న తనకి ఎక్కువ సౌకర్యాలు కలగజేసే వ్యవస్థ లేకపోతే ఏ మనిషికీ ఉత్సాహం కాని ఆశ కాని ఉండదు. ఉత్సాహం, ఆశా, పోటీభావం పోయిననాడు మానవసంఘం నశించిపోతుంది—ఆయా కారణాలన్నీ చెప్పి సోషలిజానికి వ్యతిరేకించేవారు గాంధీజానికికూడా విముఖులైతే చూపాలి గాంధీజం ఆదర్శంకూడా స్వంతఆస్తి విధాన నిర్మూలనమేకనుక. 'చిత్రకారుడు, శిల్పి, వంట భోజనం తయారుచేసేవాడూ తన స్వంతంకోసం పనిచేస్తాడా? సంఘశ్రేయస్సుకోసమే అయినా అతిశ్రద్ధగానే చేస్తాడు. అలాగే ఆస్తుల్ని సంఘపరంచేసినాకూడా వ్యక్తుల చొరవా ఉత్సాహం చావవు" అని ఒకవాదన! ఈసంఘంలో చిత్రకారుడూ శిల్పీ కూడా డబ్బుకోసమే ఎక్కువగా పనిచేస్తున్నాడు. స్వతం ఆస్తి విధానంలేని సంఘంలో కీర్తికోసం చెయ్యవచ్చు కాని సంఘంలో పనిచేసే కార్మికులందరూ శిల్పులూ చిత్రకారులూ కారే! కనీసం మానవ చిత్తవృత్తిలోనే బ్రహ్మాండమైన మార్పువచ్చేదాకా కొన్ని హెచ్చుతగ్గులుఉండి తీరాలి. "ప్రతివాడు తన శక్తిని అనుసరించి పనిచెయ్యాలి. ప్రతివాడూ తన

అవసరాల్నిబట్టి సౌకర్యాలు పొందాలి!" అనే కమ్యూనిస్టు సిద్ధాంతం ఆదర్శమే అయినా "ప్రతివాడూ తనశక్తిని అనుసరించి పనిచెయ్యాలి. ప్రతివాడు తను చేసినపనినిబట్టి సౌకర్యాలు పొందాలి" అనే సోషలిస్టు సిద్ధాంతమే ప్రస్తుతం అమలులో వుంచగలదు.

"ఒకవైపు స్వంత ఆస్తి రెండోవేపు సంఘ ఆస్తివుంటే సంఘ ఆస్తిమీద వ్యక్తులికి శ్రద్ధవుండదుకాని స్వంత ఆస్తిలేకపోతే సంఘ ఆస్తిమీదే శ్రద్ధకలిగివుంటుంది. స్వంత ఆస్తివిధానంలోని చెడుగులకన్నా కమ్యూనిజంలోని లోట్లు తక్కువ హాని చేస్తాయి"[1] అని మరోవాదన! మనిషి యొక్క సహృదయతమీద అమితమైన విశ్వాసం వుంచితేతప్ప పైవాదనని అంగీకరించలేము. అలా విశ్వాసం వుంచటంలోపమే అయితే ఆలోపం గాంధీజం కమ్యూనిజం రెండింటి ఆదర్శాల్లోనూ సమానంగానే వుంది.

ఆదర్శాలచర్చ కొంచెంకట్టిపెట్టి వ్యవహారక్షేత్రంలో కొద్దాం. కమ్యూనిస్టుల కార్మికనియంతృత్వం మాదిరిగానే గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతం, విప్లవానంతరం వెంటనే అవలంబించాల్సిన తాత్కాలిక విధానం మాత్రమే. కార్మికనియంతృత్వం అంటే పార్టీయొక్క ధర్మకర్తృత్వమే.[2] ఎంతపనిచేసినా ఒకడికి ఏమీ లాభించకపోతేనేతప్ప, యింకొకడికి, ఏమీ పనిచెయ్యకపోయినా ఆస్తిలభించడం జరగదు.[3] "స్వంత ఆస్తిని యీసంఘమే లేకుండా చేసింది 9/10 వంతు ప్రజలికి. 9 వంతుల ప్రజలికి స్వంత ఆస్తి లేకపోవడంవల్లనే మిగతా ఒక్క వంతుకి బోలెడు ఆస్తులు పెరిగాయి" అంటోంది కమ్యూనిస్టు మేనిఫెస్టో. తమను

---

1. బోల్షివిజం పే. 12.

2 P. 112 Gandhiji

3 Socialism, what and why by T. A. Jackson

సారంగా పనిచేసే రష్యాలో "ఫాక్టరీ మేనేజరు ప్ర-
అమితమైన ప్రాబల్యంతో అవతరించేసింది" అంటున్నారు
ఖన్నాగారు. "రష్యాలో కార్మికుల ప్రతినిధులతోనూ, మేనేజిమెంటు
ప్రతినిధులతోనూ కూడిన ఒక సంఘాన్ని ఎన్నుకుంటారు మొదట్లో.
...అప్పులు తీర్చడంలాంటి ఖర్చులు పోను కొంత భాగాన్ని
పెట్టుబడి ధనంగా వేరుచేసి మిగతా డబ్బు బోనసు రూపంలో
కార్మికులకి పంచిపెట్టబడుతుంది.[1] ఇదే ఫ్యాక్టరీలలో జరిగే వ్యవ-
హారం. ఉమ్మడి వ్యవసాయ క్షేత్రాల్లో కూడా దాదాపుగా
యిదే పద్ధతి అవలంబింపబడుతుంది. వీటికీ ధర్మకర్తృత్వ విధా-
నానికీ ఉండే భేదం ఒక్కటే: ధర్మకర్తని ఎన్నుకోటం అంటూ
వుండదు. మేనేజిమెంటుని ఎన్నుకోటంకద్దు. మేనేజర్లుకూడా
ఒక విధంగా ఆస్తికి అధికారులే. కాని సంస్థ యజమానులుగాదు
వాటికి ధర్మకర్తలుగా ఉన్నారు. కనుక తమ స్వంతలాభాల
కోసం వాటిని వినియోగించుకోరాదు. ఆ యా ఫ్యాక్టరీలలో
పనిచేసే యితరులకి మాదిరిగానే మేనేజర్లకీ జీతాలు ఇవ్వబడ-
తాయి. అలాంటి దృష్టితోనే యీనాటి ఆస్తి అధికారులు
వర్తించాలని గాంధీజీ కోరుతున్నారు. ఈనాటి ఫ్యాక్టరీ యజ-
మానే సోషలిస్టు సమాజంలో ఫ్యాక్టరీ మేనేజరు అవుతాడను
కోండి. అవక తవక లేమన్నా చేసినా అసమర్థుడైనా మేనేజరుని
తొలగించినట్లే ధర్మకర్తనీ తొలగించవచ్చు. "మహాత్ములు
నైతిక వాదంగా ఎన్ని ధర్మ పన్నాలు చెప్పినా అలాంటి ధర్మ-
కర్త లెవరూ బయలుదేరలేదేం?" అని ప్రశ్నించవచ్చు. శతా-
బ్దాలుగా పాతుకుపోయిన దుష్ట వ్యవస్థలోపడి కొట్టుకొంటున్న
మానవ మనస్తత్వం మార్పుని అంగీకరించడం తేలికగాదు. అయినా
సాంగ్లీ ఠాకూర్ ఘనశ్యామ్దాస్ గోపాల్దాస్ దేశాయి, సంయుక్త

---

1 'What I saw in Russia' by G. L. Khanna and Iqbal Singh

# గాంధిజం : సోషలిజం



## VI

## 4. గృహ పరిశ్రమల మీద ఆధార పడిన గ్రామీణ నాగరికత

ఈ శీర్షికని "యంత్ర పరిశ్రమలికి వ్యతిరేకత" అని మార్చేస్తే యింకా బాగుంటుందేమో! గాంధీజీని విమర్శించే వారికి అన్నిటి కంటే ప్రధానంగా కనపడేది 'యంత్రపరిశ్రమలికి గాంధీజీ వ్యతిరేకత.' నిజానికి వ్యతిరేకత 'కనపడేదే' కాని వాస్తవం కాదు. ఆనోటా ఆనోటా విని అనని మాటల్ని వ్యక్తులికి ఆపాదించి నిజమైన విమర్శనలికి పూనుకోటం విజ్ఞులికి తగింది కాదు. గాంధీగారు రాతి యుగంలో కెళ్లమంటున్నారనీ, గడియారపు ముల్లుని వెనక్కి తిప్పమంటున్నారనీ, ఆయన రైళ్లూ స్టీమర్లూ, తంతీ విద్యుచ్ఛక్తి పనికిరావంటున్నారనీ గాంధీగారి మతమే కనక ప్రబలితే ఇతర దేశాల్నుంచి పూర్వకాలపు ఓడల్లో ప్రయాణంచేసి మనిక్కొస్తే తప్ప అక్కడి వార్తలిక్కడ తెలియవని కొందరు అపవాదులు ప్రచారంచెయ్యడంకూడా జరుగుతోంది తెలిసో తెలీకో. యంత్ర పరిశ్రమలికి వ్యతిరేకత చూపడంలో కొందరు గాంధీయులు కూడా అక్కర్లేనంత దూరంపోయి వాతావరణాన్ని చెడకొట్టడం కూడా కనిపిస్తోంది అక్కడక్కడ.

మహాత్ముడు యంత్రాల విషయం ఏమంటున్నాడో ముందు విచారించి, అసలు యంత్ర వ్యతిరేకతలోని తర్కాభాసాల్ని తర్వాత పరిశీలిద్దాం. "కుటీర యంత్రంలోని ఎలాంటి అభివృద్ధికైనా నేను స్వాగతంయిస్తాను. కాని కోట్ల కొద్దీ రైతులికి యితరవృత్తులు చూపందే, చేతి పరిశ్రమల స్థానాల్లో యంత్రాన్ని ప్రవేశం ఘోరం"![1] దీంట్లో క్రిందగీత గీయబడ్డ వాక్యాంశాన్ని గమనిస్తే అన్నియంత్రాలికీ అన్నిపరిస్థితులలోనూ గాంధీజీ వ్యతిరేకి కాడని స్పష్టమవుతోంది. కోట్ల కొద్దీ రైతులికి యితరవృత్తులు చూపితే యంత్రాలికి గాంధీజీ వ్యతిరేకించడన్న మాట.

కీలక పరిశ్రమలు ప్రభుత్వపరం కావాలి. సంపూర్ణంగా ప్రజాశ్రేయంకోసమే వినియోగపడాలి.[2] కాని యంత్రాలమీద గాంధీజీకి మోజులేదనే సంగతిమాత్రం నిజం. '...యంత్రాలు మాయమైపోయినా నేను దుఃఖించను. అదేమీ విపత్తుఅని భావించను. కాని యంత్రంఅన్న ప్రతిదానినీ నిర్మూలించాలనే తలంపు నాకేమీలేదు. ముక్తికి తోడ్పడని దేహాన్నికూడా తిరస్కరిస్తాను. అదృష్టిలో యంత్రాలన్నిటినీ తిరస్కరిస్తాను. కానియంత్రాలు వుండి తీరతాయి, యీ దేహం మాదిరిగానే అవీ తప్పనిసరికనక'.[3] వ్యావహారిక ఆదర్శవాది అయిన గాంధీజీ యంత్రాల విషయంలో వాస్తవిక స్థితిని గుర్తించకపోలేదు. ఒక అమెరికన్ విలేఖరి ప్రశ్నకి జవాబిస్తూ "నేను అన్ని యంత్రాలికి వ్యతిరేకిననే అభిప్రాయం తప్పు" అన్నాడు గాంధీజీ.[4] మహదేవదేశాయి, యిలా రాశాడు: "గాంధీగారు అన్ని యంత్రాలికీ వ్యతిరేకి అని కొందరనుకుంటున్నారు. అంతకన్న పొరబాటు యింకోటిలేదు. యంత్రాలు మానవుడికి సేవచెయ్యాలనీ, యంత్రం మానవుడికి యజమానిఅయి

1 *P*. 120 **The mind of Mahatma Gandhi**
2 P. 122 „ „ „
3 P. 119 „ „ „
4 P. 302 Harijan *D*/ 2-12-1934.

కూర్చోరాదనీ ఆయన కాంక్షిస్తున్నాడు."[1] "నేను అన్ని యంత్రాలకీ వ్యతిరేకినని తెలియనివారు చాలామంది చెబుతూ నా ప్రతిష్ఠకి కళంకం కలిగించారు."[2] అన్నాడు గాంధీజీ. ప్రిన్స్‌మస్ అనే ఆయనతో సంభాషిస్తూ యంత్రాల్ని ఏ ఉద్దేశంతో ఉపయోగిస్తే తనకి అభ్యంతరం లేదో స్పష్టంగా చెప్పాడు గాంధీజీ. "గ్రామం ప్రధానంగా వినియోగం కోసం మాత్రమే ఉత్పత్తి చేస్తే గ్రామస్థులు ఆధునిక యంత్రాలు ఉపయోగించినా ఎట్టి ఆక్షేపణా ఉండదు."[3] 'నా ఉద్దేశం యంత్రాన్ని నిర్మూలనం కాదు. వాటిని హద్దులలో వుంచడమే' అని రాశాడు యంగ్ ఇండియాలో.[4] కొద్దిమంది చేతుల్లో సంపదనూ అధికారాన్నీ కేంద్రీకరించడం కోసం యంత్రాల్ని ఉపయోగించడం అన్యాయమనీ పాపమనీ నా అభిప్రాయం. ఈనాడు యంత్రం అలాగే ఉపయోగపడుతోంది.[5] యంత్రం అలా ఉపయోగపడని రోజున యాంత్రికత వ్యతిరేకించడని విదితమవుతోంది.

"కోట్లకొద్దీ మనుష్యులు నిరుద్యోగంతో సోమరులుగా నున్నప్పుడు మానవశ్రమని తగ్గించే యంత్రాలు కావాలనడంలో సారాంశమేముంది?[6] యంత్రాలవల్ల నిరుద్యోగం ఏర్పడకపోతే వాటికి గాంధీజీ వ్యతిరేకి కాడన్నమాట. ఒక విదేశీ పత్రికా విలేఖరితో సంభాషిస్తూ గాంధీజీ కుట్టు యంత్రం తనకి ఇష్టమేననీ ఆ యంత్రాల్ని తయారుచేసే ఫ్యాక్టరీలకు కూడా తాను వ్యతిరేకి కాననీ చెప్పాడు.

---

1 P. 228 Harijan *D*/ 29-8-1936
2 Gandhiji in Navajivan D/ 20-4-1924
3 P. 226 Harijan *D*/ 29-8-1936
4 Young India *D*/ 13-11-1924
5 Navajivan D/ 20-9-1926
6 Harijan-*Bandhu* *D*/ 18-11-1934

"ఈనాడు యంత్రాలు కొద్దిమంది అశేషప్రజమీద ఎక్కువ చెయ్యటానికి ఉపయోగపడుతున్నాయి. ఈవ్యవస్థతో నేను నాశక్తినంతా వినియోగించి పోరాడుతున్నా."[1] 'రాటనే ఒక చిన్న యంత్రం' అన్నాడు గాంధీజీ ఒకమాటు. కొందరు తెలివితక్కువగా అర్థంచేసుకున్నట్లు సాధ్యమైనంత ఎక్కువ మందికి పని కల్పించడమే గాంధీజీ ఏకైక ఉద్దేశమైతే రాటాలబదులు తకిలే వాడవలసినదిగా చెప్పాల్సింది. ఎందుకంటే, పదిమంది తకిలమీద తీసే దారం సమష్టిగా నలుగురే అదే కాలంలో రాటంమీద తీసేస్తారు. కనుక పదిమంది అందరికీ పనిపోతుంది. కాని అత్యధికమగు వేగంలో నూలు తియ్యటానికి వీలయ్యే రాటాన్ని కనిపెడితే, లక్షరూపాయలు బహుమానం యిస్తామని చరఖాసంఘంవారే ప్రకటించారు. కిర్లోస్కర్ కంపెనీవారు ఒక రాటం తయారుచేశారుకూడాను పూర్తిగా ఫలించకపోయినా. 29-6-1935 హరిజనులో యీవిషయమై రాస్తూ గాంధీజీ "కిర్లోస్కర్ కంపెనీవారికృషి ఫలించివుంటే వడుకువారికి గంటకి ముక్కాలి కూలి లభించేది" అన్నారు. విద్యుచ్ఛక్తి వినియోగం విషయంలో గాంధీజీ అభిప్రాయం యిది: "ప్రతి గ్రామ కుటీరంలోనూ విద్యుచ్ఛక్తి వుంటే గ్రామస్థులు తమ పనిముట్లను విద్యుచ్ఛక్తి సాయంతో నడుపుకోడానికి నేనేమీ అభ్యంతర పెట్టను."[2]

యంత్రాలవిషయమై గాంధీజీ వెలిబుచ్చిన పైఅభిప్రాయాలు సరిపోతాయనుకుంటా అన్నియంత్రాలకీ అన్ని పరిస్థితుల్లోనూ, ఆయన యంత్రాలకి వ్యతిరేకి కాదని స్పష్టంచెయ్యటానికి. కనక యంత్రాలకి వ్యతిరేకంగా ఆయన మాట్లాడితే, యీనాటి ఆర్థిక వ్యవస్థలో యంత్రాలవల్ల కలుగుతున్న దారుణమగు దోపిడివిధా

1 P. 26 Gandhiji
2, Harijan D/ 22-6-35.

నాన్ని వ్యతిరేకిస్తున్నట్లు అర్థంచేసుకోవాలి కాని అసలు యంత్రాన్నే వ్యతిరేకిస్తున్నాడని అర్థంచేసుకోరాదు.

యంత్ర పరిశ్రమలకి వ్యతిరేకంగా చేసే చిన్నా పెద్దా అనేక వాదాలు కనిపిస్తున్నాయి.

ఆవాదాల్ని ఆర్థిక, నైతిక, సాంఘిక రాజకీయనష్టాలుగా విభజించవచ్చు.

### I. ఆర్థిక నష్టాలు

1. యంత్రం నిరుద్యోగాన్ని హెచ్చిస్తుంది. 2. వస్తువుల నాణ్యాన్ని తగ్గిస్తుంది.

### II. నైతిక నష్టాలు

1. యంత్రాలవల్ల విశ్రాంతి కాలం హెచ్చటంచేత దుర్వ్యసనాలు పెరిగిపోతాయి. 2. శిల్పకారుని సృజనశక్తి నశించి పోవటంచేత నైతిక పతనంపొందుతాడు. 3. మానవుణ్ని దాసుడిగా చేసి అతని వ్యక్తిత్వాన్నే చంపుతాయి యంత్రాలు.

### III. సాంఘిక నష్టాలు

1. యంత్రాలుగృహజీవితాన్ని భగ్నంచేస్తాయి. 2. భారీ యంత్రాలవల్ల ప్రమాదాలు హెచ్చుతాయి. 3. జీవశాస్త్రరీత్యా పరిశీలిస్తే యాంత్రిక నాగరికతవల్ల సంతానోత్పాదకశక్తి తగ్గుతుందని తెలుస్తోంది.

### IV. రాజకీయ నష్టాలు :-

1. యంత్రాలు విదేశీయుల ఆకాశదాడులికి ఎక్కువగా నష్టం పొందుతాయి.

2. ప్రపంచపు అంగడులకోసం దేశాలు పోటీలుపడి యుద్ధాలికి దారితీస్తాయి.

పై వాదాల్ని సంక్షేపంగా పరిశీలిద్దాం.

## ఆర్థిక సమస్యలు.

### 1. యంత్రాలవల్ల నిరుద్యోగం హెచ్చుతుందా ?

'చేతి పరిశ్రమల్లో వందమంది చేసే పని యంత్రాలలో అయితే పదిమందే చేస్తారు. కనక మిగతా 90 మందీ నిరుద్యోగులై మలమల మాడిపోతారు.' అనే వాదం పైకి నిజమల్లే కనిపిస్తుంది. లాభాపేక్షతో పెట్టుబడిదారు సాధ్యమైనంత తక్కువ మంది కార్మికులచేత, వేగవంతమైన యంత్రాలమీద కష్టమైన ఎక్కువగంటలు పనిచేయించి అవకాశం ఉన్నంతవరకు అధికోత్పత్తి చేయించి లాభాలు జేబులో వేసుకుంటున్నాడు యీ నాడు. ఈ ఆర్థిక వ్యవస్థవల్ల నిరుద్యోగం వచ్చిందికాని, యంత్రాలవల్ల కాదు. ఉత్పత్తి పంపకాలు పద్ధతి ప్రకారం చేసిననాడు యీ పరిస్థితి వుండదు. ఉదాహరణకి వెయ్యిమంది కార్మికులుగల ఒక గ్రామం తీసుకుందాం. వెయ్యిమందీ చేతిపరిశ్రమలలో రోజుకు పది గంటలు పనిచేస్తే ఆ గ్రామానికి సరిపోయే కనీసపు అవసరాలకి కావాల్సినవస్తువులు ఉత్పత్తిచెయ్యగలుగుతారనుకోండి. గ్రామంలో రోడ్లువెయ్యడానికీ మంచి భవనాలు కట్టుకుంటానికీ, విద్యుచ్ఛక్తి సరఫరాకీ యితర సౌకర్యాలు సమకూర్చుకోటానికీ అవకాశం వుండదు, జీవితావసరానికి కావాల్సినవస్తువుల్ని ఉత్పత్తి చేసుకుంటానికే రోజుకి పదిగంటలు పనిచెయ్యాల్సి వస్తుంది కనక. కాని, యంత్రాలమీద ఆ వస్తువుల్ని ఉత్పత్తిచెయ్యటానికే, షుమారుగా రెండువందలమంది రోజుకి అయిదుగంటల చొ॥న మాత్రమే పనిచేస్తే సరిపోతుంది. మిగతా ఎనిమిదివందలమందీ, రోడ్లూ భవనాలూ వగైరా పైన వివరింపబడిన యితర సౌకర్యాల్ని సమకూర్చుకుంటానికి పనిచేస్తారనుకోండి. అప్పుడు నిరుద్యోగం ఎక్కడుంటుంది? పైగా ప్రతిమనిషికీ కావలసినంత విశ్రాంతి దొరుకుతుంది. భవనాలూ, రోడ్లూ వగైరా సౌకర్యాలు సమకూర్చుకునే అవకాశం కలుగుతుంది.

ఒక పొలంలో కొంతమంది మానవులు పూర్వకాలపు నాగళ్లతో పనిచేసి కొంత ధాన్యాన్ని ఉత్పత్తి చేశారనుకోండి— అంతే ధాన్యాన్ని సగంమంది పనిచేసి ట్రాక్టరుని ఉపయోగించడం వల్ల పండించారనుకోండి. రెండింటిలోనూ ఉత్పత్తి సమానమేకనక ఆహారపదార్థాలు తక్కువవుతాయనే సమస్య వుండదు. మిగతా సగంమంది సోమరులుగా కూర్చోకుండా యితర నిర్మాణాలు చేస్తారు. అప్పుడేలాంటి నష్టమూ వుండదు. దేశంలో వుండే మనుష్యశక్తిని బట్టి యంత్రాలవేగాన్ని బట్టి అవసరమైన వస్తువుల పరిమాణాన్ని బట్టి, పనిచేయాల్సిన గంటలపరిమితి నిర్ణయించబడుతుంది. విశ్రాంతి సమయం మరీ ఎక్కువైపోయి మానవుడు పని కావాలని పరితపించే సందర్భాలు వచ్చేటట్లుంటే యంత్రాలవేగాన్ని క్రమంగా తగ్గించవచ్చు. కాని మానవసౌఖ్యంకోసం యెన్నో నిర్మాణాలు చేయటానికి ఎంతో మానవశ్రమ, శక్తి కావాల్సివున్న ఈ నాటి సంఘంలో అన్ని కార్యాలూ అందరికీ ఇప్పుడే పని కావాలని పరితపించే రోజు రానేరాదేమో! కనుక నిరుద్యోగ సమస్య పెట్టుబడిదారీ విధానంవల్ల వచ్చిందిగాని యంత్రాలవల్ల కాదని స్పష్టమవుతోంది. ఇతర విషయాల్లో ఎంత విమర్శనకు గురైనా నిరుద్యోగసమస్యాపరిష్కారవిషయంలో రష్యాదేశం ప్రబలనిదర్శనంగా వుంది. "రష్యాలో లాభకాంక్ష అనేది సంఘపరంచెయ్యబడినా, ధనస్వామ్యపు కేంద్రీకరణ విధానంయొక్క ఇతరనష్టాలు వుండనే వున్నాయి. యంత్రపరిశ్రమలు వృద్ధిపొందిన ఏ దేశమూ నిరుద్యోగ సమస్యకి గురికాకుండా వుండలేదు. రష్యాలోని ప్రయోగం మొన్న మొన్నటిదే అవడంచేత దాన్ని వాదనగా తీసుకోటానికి వీల్లేదు" అంటున్నారు కుమారప్పగారు.[1] ఇతరనష్టాలుంటే వున్నాయేమోగాని ఏమైనా యంత్రాలే నిరుద్యోగానికి కారణం కాదనే సంగతి అంతా ఒప్పుకోవాలిసే వస్తోంది.

---

1 Harijan D/ 4-5-35

## 2. వస్తువుల నాణ్యం తగ్గుతుందా ?

యంత్రాల్ని కనిపెట్టిన కొత్తరోజుల్లో సరుకు నాణ్యంగా వుండేదికాదు. కాని పరిశోధనలు వృద్ధిచెందినకొద్దీ నాణ్యమూ కలిపిస్తూనేవుంది. భారతదేశంలాంటి పరాధీన దేశాలికి విదేశాలు సరఫరాచేసే యంత్రాలు మొదటిరకంగా వుండవు. యంత్రాల్లో తయారైన తమ వస్తువులు చలామణీ కావాలనే కాంక్షతో విదేశాలు మంచిరకం యంత్రాల్ని యితరులికి పంపవు. అందువల్లకూడా మనదేశంలో యంత్రాలతో తయారయే వస్తువుల నాణ్యం తక్కువగా వుంటోంది. ఆర్థిక రాజకీయ వ్యవస్థలే పూర్తిగా మారితాయి, ప్రతిదేశమూ స్వతంత్రమైనప్పుడు అన్నిదేశాలికీ మేలురకం యంత్రాలే సమకూడుతాయి. స్వతంత్రదేశాలు అట్లాంటి యంత్రాల్ని నిర్మించుకుంటాయికూడాను. 'ఎన్ని సదుపాయాలు చేకూర్చుకున్నా యంత్రాలమీద మన్నికగల వస్తువుల్ని ఉత్పత్తి చెయ్యలేము' అని వాదనకోసం ఒప్పుకుందాం. అయినాకూడా యంత్రాలు అధికోత్పత్తి చేస్తాయికనక, ఒకటి వాడుకునేచోట రెండువస్తువులు వాడుకోవచ్చు. అప్పుడేమీచిక్కూవుండదు. నాణ్యం తక్కువవల్ల పొందే నష్టంకన్న యంత్రాల్ని వినియోగించడంవల్ల పొందే సుఖం ఎన్నోరెట్లు ఎక్కువ.

## II. నైతికనష్టాలు

### 1. విశ్రాంతి – దుర్వ్యసనాలు.

"ఏమరిపాటుబుర్ర సైతానుకి కర్మాగారం. మనిషికి పూర్తిగా పనివుంచేతప్ప, మంచిగా ప్రవర్తించడు. విశ్రాంతి ఎక్కువయితే దుర్వ్యసనాల్లో పడతాడు. యంత్రాలు విశ్రాంతి సమయాన్ని హెచ్చుచేస్తాయి కనక యంత్రాలు పనికిరావు." అని వాదన. రోజుకి ఎనిమిదిగంటలు ప్రతివాడూ పనిచెయ్యాలని గాంధీగారి ఉద్దేశం. అంతకి తక్కువయితే మనిషి చెడిపోతాడం

చూడు. ఎడ్వర్డ్ బెల్లమీ “లుకింగ్ బాక్‌వర్డ్” అనే పుస్తకంలో విశ్రాంతి ఎక్కువగావుండే ఒక భావప్రపంచాన్ని సృష్టించాడు. “అలాంటిప్రపంచంలో నాకు పిచ్చెక్కుతుంది” అన్నాడు గాంధీజీ.[1] పెట్టుబడిదారీ విధానంలో కార్మికుడు అమితమైన శరీరశ్రమ చెయ్యవలసి రావడంచేత, మరో వికాసానికి అవకాశమే లేక పోతోంది. దొరికిన కాస్త విశ్రాంతి సమయాన్నీ తాగుడు, జూదం, వ్యభిచారంలాంటి దుర్వ్యసనాల్లో గడిపి తన కష్టాల్ని మరచిపోవడానికి ప్రయత్నిస్తున్నమాటకూడా వాస్తవమే. అంత మాత్రంచేత విశ్రాంతే పనికిరాదనడం ఏంసబబు? “భారతదేశంలో విశ్రాంతిసమస్య లేనేలేదు. ఎందుకంటే, కళాకారుడు తన ఆత్మనే తన పనిలోకి చొప్పిస్తాడు. అతడు తన పనిని గంటలలో గాని, మజూరీతో గాని కొలవడు. భారతదేశంలో పనే విశ్రాంతి, విశ్రాంతే పని. ఇక్కడి సమస్య విశ్రాంతి సమయంలో పని కల్పించడం ఎలాగా అనేదేగాని, పనివాడికి విశ్రాంతి కల్పించడం ఎలాగా, అనేది కాదు.” అంటున్నారు డాక్టరు పట్టాభిగారు!

కళాకారుని విషయంలో పైవ్యాఖ్యానం సరిపోయినా ఊడ్పులూ, కోతలూ, నూర్పిడీచేసే రైతుకీ, యితర విధాలుగా కాయకష్టంచేసే కళాకారులు కాని కార్మికులికీ విశ్రాంతి కావాల్సిందేకదా! విశ్రాంతి సమయాన్ని సాధారణంగా దుర్వినియోగంచేసుకునే సాధనాలు మూడు: తాగుడు, జూదం, వ్యభిచారం. మద్యనిషేధ శాసనం అమలులో పెడితే తాగుడుకి అవకాశం వుండదు. ధనాశ జూదానికి మూలం. అలాంటి ఆశని పెంపొందించేది యీ పెట్టుబడి దారీ విధానం. ఈవిధానాన్ని నిర్మూలించినప్పుడు జూదానికి అవకాశమే వుండదు. అలాగే దొంగతనం కూడాను.

వ్యభిచారానికి ప్రధాన కారణం బీదరికం. ఆబీదరికానికి కారణం మళ్ళీ యీ పెట్టుబడిదారీ విధానమే. ఇది నిర్మూలింప

1 P. 19 *Socialism & Gandhism* by Asoka Mehta

ఇటువంటప్పుడు వ్యభిచారాని కవకాశంయిచ్చే బీదస్త్రీలుగాని, నీచ స్థాయి పనుప్రవృత్తిచే జీవించేవర్గాలుగాని వుండవు. కనక వ్యభిచారం క్షీణించి పోతుంది చాలావరకు.

నిజమైన ప్రజాప్రభుత్వంలో ప్రజల మానసిక వికాసాన్ని వృద్ధిచేసే పాఠశాలలూ, ప్రదర్శనశాలలూ, రేడియోలూ, సినిమాలూ నాటకాలూ, ఉపన్యాసాలూ గ్రంథాలయాలూ విరివిగా పెంపొందుతాయి. అప్పుడు మానవుడు తన విశ్రాంతిసమయాన్ని సాంస్కృతికాభివృద్ధికి తప్పకుండా వుపయోగించుకుంటాడు. సాంస్కృతికంగా అభివృద్ధిచెందిన వ్యక్తి దుర్వ్యసనాలికి లోను కాడు.

## 2. శిల్పకారుడు-యంత్రం

“యంత్రానికీ కళకీ వైరుధ్యం. యంత్రంలో తయారయిన వస్తువులు కళావిహీనాలుగావుంటాయి. యంత్రాలవల్ల కళాకారుని సృజనశక్తి నశిస్తుంది. కనక అతను నైతికంగా పతనం పొందుతాడు” అని వాదన. యంత్రాల్లో తయారైన ఏవస్తువులోనూ జీవకళవుండదనడం సత్యం కాదు. అదీగాక యంత్రసహాయంతో కాని లభ్యం కాని ఫోటోగ్రాఫిక్ ఆర్టు చిత్రకళలోనూ సినిమాలు నాట్యకళలోనూ సుస్థిరమైనస్థానంసంపాదించుకున్నాయి. అయినాకూడా “ఆధునిక కర్మాగారంలో పనిచెయ్యడంవల్ల తరచుగా సృజనశక్తి నశిస్తుంది” అంటోంది మేరీసదర్లాండ్. ఆడంస్మిత్, డేవిడ్ రికార్డో, ప్రిన్స్ క్రోపాట్కిన్, బెర్నార్డ్ షా, ప్రొఫెసర్ [illegible] మొదలయినవాళ్లు కూడా దాదాపు యీ అభిప్రాయాన్నే వెలిబుచ్చారు. కార్ల్ మార్క్స్ కూడా కమ్యూనిస్టు మేనిఫెస్టోలో “అమితంగా యంత్రాల్ని ఉపయోగించడంవల్ల మానవుడు వ్యక్తిత్వాన్ని పనిలోవుండే అందాన్ని కోల్పోతున్నాడు” అని రాశాడు. కాని యీదుష్పరిణామం కమ్యూనిస్టు సంఘంలో కలగదు.

"యంత్రంమీద 300 నెంబరువరకు నూలు తీయవచ్చు. కాని చేతితో అయితే 400 నుంచి 1000 నంబరువరకు తియ్యటానికి అవకాశం వుంది. అదీగాక యంత్రాలమీద తయారయ్యే వస్త్రాలు ధరించటానికి పనికిరాకుండా పోతున్నాయి కూడాను.[1] టావర్నియర్ అనే ఫ్రెంచి యాత్రికుడు "మహమ్మదలీబేగ్ షాకి నిప్పుకోడి గుడ్డంత కొబ్బరికాయ ఒకటి బహూకరించాడు. దానిలో 80 కూర్యాళ్ళ పొడవుగల తలపాగా వుంది!" అనిరాశాడు.[2] గజంన్నర వెడల్పుగల చీరెను ఉంగరంలో మార్చడం మనం యీనాడుకూడా చూస్తూనే వున్నాం"—ఈ ఉదాహరణలు చూపిస్తూ 'యంత్రాలవల్ల ఇలాంటి కళలు నశిస్తాయి' అని తీర్మానిస్తున్నారు కొందరు. కళాసృష్టిలో నిగూఢంగా వుండే వస్తువుల్ని యంత్రాలమీద తయారు చెయ్యలేక పోతే అలాంటివాటిని చేతితోనే తయారు చేయవచ్చు. కాని ఏలాంటి కళాప్రావీణ్యం అవసరంలేనిదీ, ఎక్కువగా మామూలు వాడుకకి పనికివచ్చే ముతకసరుకు యంత్రాల్లో ఉత్పత్తిచేస్తే ఏలాటి నష్టమూ వుండదు. అలాగే వ్యవసాయానికి మామూలు నాగళ్ళు ఉపయోగించినా ట్రాక్టర్లు ఉపయోగించినా కళకి ఏమీ భంగంరాదు కదా! కళాప్రావీణ్యాన్ని పెంపొందించేపనులకి ప్రభుత్వం ప్రోత్సాహం యివ్వవచ్చు. అంతగా అవసరం అయితే మిల్లులో 200 నంబరుకుపైన నూలు తీయరాదని నిషేధించవచ్చు, ఖద్దరని మోసం చెయ్యటానికి వీలులేకుండా 20 నంబరుకు తక్కువనూలు మిల్లుల్లో తీయరాదని యీనాడు నిషేధించాలని కోరుతున్నట్లుగానే!

## 3. యంత్రాలు మానవుణ్ణి దాసునిగా చేస్తాయా?

తాను సృష్టించిన యంత్రానికి మానవుడు దాసుడవటం నిజంగా సిగ్గుచేటు. పెట్టుబడిదారీ విధానంలో యంత్రాలవల్ల

---

1. P. 349 Gandhi & Gandhism. 2 Quoted in Page 74. Gandhian plan—

అది క్షీణించదు. రేడియో, టెలిపతీ, టెలివిజన్ లాటివి మానవుడి కుశలతకి నిదర్శనాలు గాని, బుద్ధిమాంద్యానికి ఉదాహరణాలు కావు.

## III. సాంఘిక నష్టాలు

### 1. గృహజీవితాన్ని యంత్రాలు భగ్నంచేస్తాయా?

పెద్ద పెద్ద ఫ్యాక్టరీలలో స్త్రీలూ, పురుషులూ, యింటా వాకిలీ విడిచిపెట్టి పనిచెయ్యాల్సి వస్తుంది కనక గృహజీవితం భగ్నం అవుతుందని వాదన. పల్లెటూళ్లలో స్త్రీలుకూడా ఊడ్పులికీ కోతలికీ వెళ్లడం, పనిచెయ్యడం అనాదినుంచీవుంది. గృహజీవితం అందువల్ల ఎలాంటి నష్టమూ చెందలేదు. కాని యీనాటియంత్ర వాతావరణంలో కార్మికుడి గృహజీవితం నష్టంచెందటం వాస్తవమే కొంతవరకు. దానికి కారణాలు మటుకు యంత్రాలు కావు. కార్మికుడికి తగినంత జీతంలేకపోవటంచేతా, బస్తీజీవనం, చాలా ప్రియంకావటంచేతా పాపం కార్మికుడు తన పెళ్లాం బిడ్డల్ని గ్రామంలోనే వుంచేసి తనొక్కడే బస్తీజేరుతున్నాడు. అందువల్ల కుటుంబ సుఖం పొందే అవకాశంవుండటంలేదు. చాలినంత జీతం కార్మికుడికి లభిస్తే కాపరం బస్తీలోనే పెడుతాడు. పల్లెల్లో ఊడ్పులికీ కోతలికీ వెళ్లినట్లే ఫ్యాక్టరీ పనిలోకి కూడా స్త్రీలూ పురుషులూ పోతారు. సాయంత్రానికి యింటికి తిరిగివచ్చి కుటుంబంతో హాయిగా కాలక్షేపంచేస్తారు.

ఈ దుష్పరిణామాన్ని ఎదుర్కొంటానికి యింకో ఉపాయం విద్యుచ్ఛక్తిద్వారా యంత్రాల్ని గ్రామాల్లోకితీసుకుపోవడం. అలా అయితే అయిదారుగురు పనివాళ్లు అనగా దాదాపు ఏకుటుంబానికాకుటుంబమే తమ తమయిళ్లల్లో విద్యుచ్ఛక్తి ద్వారా పరిశ్రమల్ని నడుపుకోవచ్చు. అప్పుడు గృహజీవితం ఎంతమాత్రం భగ్నంకాదు. "పునర్నిర్మాణ విధానమేదైనా విలువగలివుండా

లంకే, వికేంద్రీకరణమే ఆదర్శంగా పెట్టుకోవాలి"[1] విద్యుచ్ఛక్తి వల్ల యీ వికేంద్రీకరణం సాధ్యపడుతుంది. అంతేకాని యంత్రాల్ని తోసెయ్యకూడదు.

"యంత్రాల్లో స్త్రీ పురుషులు కలిసి ఒకేచోట పనిచెయ్యాలి కనుక అవినీతికి అవకాశం ఎక్కువ" అని యింకోవాదన. గ్రామాల్లో వ్యవసాయపు పనులు స్త్రీ పురుషులు కలిసే చేసుకుంటూ వుంటున్నారు ఎప్పటినుంచో. ఈ అభ్యంతరం అక్కడ వర్తింపచెయ్యరు. పైగా కలిసి చదువు(కో ఎడ్యుకేషన్) కావాలనికోరేయీ రోజుల్లో దీనికి తావేలేదు. అంతగా అవసరమనితోస్తే పని స్వభావాన్ని బట్టి ఆయా చోట్ల, కేవలం పురుషుల్నీ కేవలం స్త్రీలనో నియమించవచ్చు. అంతేతప్ప అసలు యంత్రాన్నే తిరస్కరించాలనడం ఏమంత మంచి సలహా?

## 2. యంత్రాలవల్ల ప్రమాదాలు హెచ్చుతాయి.

"రైళ్లూ, మోటార్లూ, ట్రాములూ, విమానాలూ, స్టీమర్లూ, ఫ్యాక్టరీలూ,— వీటివల్ల ప్రమాదాలు హెచ్చుతాయి. మట్టి రోడ్లమీద మోటార్లు నడవ్వుకనక, కంకర వేయించాలిసొస్తోంది. రాకపోకలు మరీ హెచ్చేసరికి, సిమెంటురోడ్లూ, తారురోడ్లూ అవసరమయ్యాయి. మనుష్యులు నడవటానికి వేరే దార్లు కావాలిసొస్తాయి. 'ఓవర్ బ్రిడ్జీలూ,' 'లోబ్రిడ్జీలూ,' సబ్‌వేలూ— అంతులేని ఖర్చూ, పైగా ప్రమాదాలూను. కనక యంత్రాలు పనికిరావు" అని వాదన.

తగిన కట్టుదిట్టాలుచేస్తే యీ ప్రమాదాల్ని చాలావరకు తగ్గించవచ్చు. ఆ యీ యంత్రాల్ని ఎక్కువగా వ్యక్తులు స్వంత పెట్టుబడితో నడపడంచేత, లాభాలు తక్కువవుతాయనే ఉద్దేశం వల్ల, ప్రమాదాల్ని తగ్గించటానికి చెయ్యాల్సినంతఖర్చుచేసి నివారణ సాధనాల్ని నిర్మించడంలేదు. బాధ్యతగల ప్రభుత్వమే పూను

1 Prof-Ginsberg quoted in 'Gandhian plan'

కుంటే ప్రమాదాన్ని చాలావరకు తగ్గించవచ్చు. ప్రమాదాలు కలిగే అవకాశం వుండకుండా రైళ్లని బహిష్కరించాలని అంటే, ఎంత అసంబద్ధంగా వుంటుందో, యంత్రాల్ని బహిష్కరించా లన్నా అంతే అసంగతంగా వుంటుంది.

## 3 జీవశాస్త్రం-యంత్రాలు.

శాస్త్రీయ దృష్టితో విషయపరిశీలన చెయ్యడం పరిపాటైన యీ రోజుల్లో యంత్రవ్యతిరేకతకి శాస్త్ర ప్రమాణం చూపడం కూడా సహజమే. యాడంస్మిత్ చే వ్రాయబడిన "వెల్త్ ఆఫ్ నేషన్స్" అనే పుస్తకంలో యిలావుంది: "...స్త్రీలలో పెచ్చు పెరిగిన విలాస ప్రియత్వం వారిని బలహీనుల్ని చేసి క్రమంగా వారి సంతానోత్పాదకశక్తి పూర్తిగా నశింపుచెయ్యడం జరుగుతోంది. దీనికి ప్రధాన కారణం పట్టణాల్లోని సమ్మర్దమే' [1] పట్టణాలలో సమ్మర్దానికి కారణం యంత్రనాగరికత కనుక లాన్సెలాట్, హాగ్‌బెన్ లాంటి నిపుణులు "మానవజాతి నిలిచి వుండాలంటే గ్రామాలికి, మరలండి. బస్తీలోని ధనికుల సంతానోత్పాదక శక్తి గ్రామీణుల సంతానోత్పాదకశక్తికంటె చాలారెట్లు తరిగి పోయింది" అని హెచ్చరిస్తున్నారు. శాస్త్రవేత్తల పరిశోధల్ని కాదనలేము. పై అరిష్టాలికి జనసమ్మర్దమే కారణం కనుక ఒకే బస్తీలో చాలా ఫ్యాక్టరీలు పెట్టకుండా అవసరాన్ని బట్టి వూరికి ఒకటో, రెండో పెడితే జన సమ్మర్దపుసమస్య పరిష్కరింపబడు తుంది. విద్యుచ్ఛక్తిద్వారా గ్రామాల్లోకే పరిశ్రమల్ని పంపిస్తే గ్రామాలు పరిశ్రమల దగ్గిరికి రానక్కర్లేదు. అంతేతప్ప పైజీవ శాస్త్ర ప్రమాణాన్ని ఆధారంచేసుకుని యంత్రాల్ని వ్యతిరేకించ డంలో అర్థంలేదు.

---

1. Quoted in 'Gandhian Plan.'

# IV. రాజకీయనష్టాలు

I యుద్ధాలు—"యంత్రాలవల్ల అధికోత్పత్తి జరుగుతుంది. ఈ సరుకును కొనుక్కోటానికి కొన్ని దేశాలుండాలి. ఆ దేశాల్ని తమ అధీనంలో వుంచుకోటానికి పోటీలూ, స్పర్ధలూ, యుద్ధాలూ పెరుగుతాయి. ఉత్పత్తి పంపకాల్ని సంఘపరంచేసి వ్యక్తుల లాభ కాంక్షను అరికట్టిన దేశాలే ఆ లాభకాంక్షకి గురియై యుద్ధానికి దారితీస్తాయి. కనక యంత్రాలు పనికిరావు" అని మరో వాదన. ఈ తర్కాన్ని ఆధారంచేసుకునే కుమారప్పగారు "కేంద్రీకృత ఉత్పత్తివిధానప్రసారమే హింస"అనీ, డాక్టరు పట్టాభిగారు "క్రియాత్మకమగు హింసావిధానమే పారిశ్రామిక తత్వం" అనీ నిర్వచించారనుకుంటా.

నిజమైన అంతర్జాతీయ సమాఖ్య ఏర్పడి ఆయుధ విసర్జనమో, కనీసం మితాయుధ సముపార్జనమో అమలులో పెట్టగలిగిననాడు కాని యుద్ధాలప్రమాదంపోదు. అలా శాసించగల సమర్థత వుండే అంతర్జాతీయ సంస్థ ఏర్పడితే, ఆర్థికంగా ఒకదేశాన్ని ఇంకో దేశం దోచుకునే విధానంతో వ్యాపారాలు సాగించరాదనే నియమం అతితేలికగా ఏర్పర్చవచ్చు. అలాంటి శక్తివంతమైన సంస్థ ఏర్పడనన్నాళ్లూ పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన ధనస్వామ్య దేశాలు వెనుకబడివున్న దేశాల్ని దోపిడిచేస్తూనే వుంటాయి. అన్ని దేశాలూ యంత్రాల్ని విసర్జించడమూ అసంభవమే. కొన్ని దేశాలు మాత్రమే గ్రామపరిశ్రమల్ని పెట్టుకొని కూర్చోటం, పారిశ్రామికంగా వృద్ధిచెందిన ధనస్వామ్యదేశాలబారినుండి తప్పించుకోటానికి మార్గమూ కాదు. "మనమంతా గ్రామపరిశ్రమల్నే చేపట్టి యంత్రాల్ని విసర్జిద్దాం" అని అన్నిదేశాలూ ఒక నిర్ణయానికి రాగలిగే శుభదినం వచ్చినప్పుడు, అంతకన్న ప్రయోజనకరమైన

యంత్రవిధానాన్నే స్వీకరించి "ఒక దేశాన్నొక దేశం ఆర్థికంగా దోచుకోకుండా వుందాం" అనే నిర్ణయానికి తేలికగానే రావచ్చు.

## 2. విమాన దాడులు

కేంద్రీకృతమైన పరిశ్రమలు విదేశీయుల విమానదాడులికి యిట్టే గురిఅవుతాయి. గ్రామపరిశ్రమల్ని ఎంతటి శత్రువయినా తేలికగా నాశనం చెయ్యలేదు. "గ్రామీణ నాగరికత పై సుసంఘటితమైన భారతదేశం,నావిక వైమానికాది దళాలతో కూడిన పట్టణ యాంత్రిక నాగరికతపై సంఘటితపరచబడిన భారతదేశం కంటె విదేశీయుల దాడులవల్ల తక్కువనష్టం పొందుతుంది."[1] పేదరికతబడిగా చీనా, జపాను దాడుల్ని ప్రతిఘటించి నిలవగలగటానికి కారణం చైనీయుల పారిశ్రామిక సహకారకేంద్రాలూ, గొరిల్లా పరిశ్రమలే— నిజమే, కాని పైకారణాలవల్ల యంత్రాలు పనికిరావనడంమాత్రం అర్థంకావటంలేదు. పరిశ్రమల వికేంద్రీకరణానికీ చేతిపరిశ్రమకే తేడావుంది. పరదేశీయుల దాడులికి గురికాకుండా వుండటానికి వికేంద్రీకరణం ఉపయోగకరమే. ఒకే చోట చాలా ఫ్యాక్టరీలు పెట్టకుండా, గ్రామానికి ఒకటో రెండో ఫ్యాక్టరీలు పెట్టడంవల్ల కొంతవరకూ, విద్యుచ్ఛక్తిద్వారా గ్రామాలకే పరిశ్రమల్ని తీసుపోవటంవల్ల చాలావరకూ యీ వికేంద్రీకరణ సాధించవచ్చు. అందుకోసం యంత్రాల్నే విసర్జించడం గాని, చేతిపరిశ్రమల్నే పెట్టుకు కూర్చోటంకాని అవసరంలేదు. విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే యంత్రాల్నికూడా భారీఎత్తున కాకుండా చిన్న ఎత్తున సాధ్యమైనన్ని ఎక్కువకేంద్రాల్లో స్థాపిస్తే విదేశీయుల దాడివల్ల తక్కువనష్టమే కలుగుతుంది.

యంత్రాలలో తయారుచేసిన ఆహారపదార్థాలు ఆరోగ్యానికి భంగకరం అని ఒకవాదనవుంది. మరబియ్యం, మరనూనె

1. Gandhiji in Harijan D/ 30-12-34

పురపిండిలాంటివి నిజంగా ఆరోగ్యానికి హానికరమే. అలాంటి వాటిని నిషేధించవచ్చు. కాని ఆసాకు తీసుకుని అసలు అన్ని యంత్రాలకీ ఎసరుపెడదామనడం సమంజసం కాదు.

యంత్రపరిశ్రమలు వృద్ధిపొందితే వాటితోపాటు విప్లవాత్మకమైన కార్మికవర్గం పెంపొందుతుందికనక విప్లవాన్ని వ్యతిరేకించే కొందరు యంత్రాల్నికూడా వ్యతిరేకిస్తారు. "అందుకనే జార్ చక్రవర్తి పారిశ్రామికాభివృద్ధిని ప్రోత్సహించలేదు."[1]

జారుకి పట్టినగతే యీ వాదానికీ పడుతుంది.

యంత్రవ్యతిరేకతకి చూపే వివిధవాదాల్ని తర్కశాస్త్రపైన పరిశీలించాం. భారత యువకుల హృదయానికి ప్రాతినిధ్యం వహించే జవహర్లాల్ నెహ్రూకి యంత్రాలవిషయమై ఎలాంటి అభిప్రాయం వుందో చూద్దాం. ఖద్దరుకీ గ్రామ పరిశ్రమలకీ వ్యతిరేకంగా నెహ్రూ ఉపన్యసించాడని పత్రికలలో ప్రకటించబడితే గాంధీజీ ఒకమాటు – అసలు సంగతేమిటని నెహ్రూకి రాశాడు. అప్పుడు నెహ్రూ యిలా సమాధానమిచ్చాడు"... ఖాదీ మన ప్రస్తుత కార్యక్రమంలో ముఖ్యమైన అంశం. కాని ప్రస్తుత సాంఘిక వ్యవస్థ యిలాగే సాగిపోతూవుంటే, దారిద్ర్య సమస్యని ఖాదీ శాశ్వతంగా పరిష్కరించజాలదని నేను నా ఉపన్యాసాల్లో చెప్పా."[2] మద్రాసు కాంగ్రెసు కార్మికమంత్రి గిరి గారు సేలంలో 1938 లో బట్టలమిల్లుకి శంఖుస్థాపనచేస్తూ 'అందరికీ సరిపోయేంత ఖద్దరు మనం ఉత్పత్తిచెయ్యలేము' అని చెప్పినట్లు పత్రికలలో ప్రకటింపబడితే గాంధీగారు సంజాయిషీ అడిగారు. "కాంగ్రెసు మంత్రి అయివుండికూడా బట్టలమిల్లుకి శంఖుస్థాపన చెయ్యడంలో ఏమీ అసందర్భం లేదని సమర్థించుకుంటూ తన

---

1, Socialist Sixth of the World P, 71
2. Harijan D/6-6-36 P. 132

ఉపన్యాసం మటుకు సరిగా రిపోర్టు చేయబడలేదని సరిగాను సమాధానం వ్రాశారు గాంధీజీకి.[1] బెంగుళూరులో ఆచార్య పి. సి. రే "ఖాదీకి రోజులు దగ్గరకొచ్చాయి" అని చెప్పినట్లు పత్రికలలో ప్రకటించబడటం ఆయనగారి రిపోర్టు తప్పవడం జరిగింది. ఆరోజుల్లోనే శాస్త్రీయదృష్టితో చూసేకొందరు గ్రామపరిశ్రమలవిషయమై పడే అభిప్రాయాలికి సూచికలుగా వుంటూవునే పై ఉదాహరణలు ఉల్లేఖించబడ్డాయి. పెట్టుబడిదారీ విధానం నిర్మూలింపబడి, ఉత్పత్తిపంపకాలు ప్రభుత్వపరం చెయ్యబడిన తర్వాత గ్రామపరిశ్రమల స్థానంలో మార్పుకలిగి తీరాలనే అభిప్రాయాన్ని మనస్సులో వుంచుకుని, భారతదేశంలోని ప్రస్తుత పరిస్థితుల్ని సరిగా గమనించకుండానే కొందరు ఖద్దరుకీ గ్రామపరిశ్రమలికీ ప్రాతిపాల్యం చూపుతూ అదే తీవ్రవాదం అనే ఆత్మవంచనకి లోనవుతున్నారు. "సోషలిజం స్థాపించాలంటే కార్మిక నియంతృత్వం తప్పనిసరికనక ముందు కార్మికవర్గం వృద్ధిజెందాలి. అందుకోసం పెట్టుబడిదారీ విధానం కూడా తప్పనిసరిగా వృద్ధిపొందాలి" అనే కుతర్కం చేసేవాళ్ళు కూడా లేకపోలేదు. 'వితంతువివాహాలు చెయ్యటం గొప్పసంస్కరణ. అందుకుగాను బాలవితంతువులు కావాలి, బాలవితంతువులు విరివిగా లభ్యంకావాలంటే యీడూజోడూ లేని వృద్ధవివాహాలు చెయ్యాలి' అన్నట్టుంది పైవాదన. పెట్టుబడిదారీ విధానం ఉన్నంతకాలం యంత్రాల్లో తయారైన వస్తువుల్ని కొనడమంటే కోటీశ్వరకోట్లనీ, కార్మికుల బీదరికాన్నీ పెంపొందించడమన్నమాట. పరప్రభుత్వం వున్నంతవరకు పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోయటం అసాధ్యం. కనక పరప్రభుత్వాన్నీ పెట్టుబడిదారీ విధానాన్నీ పారదోలేదాకా భారతదేశంలోని పురోగామివర్గాలు గ్రామపరిశ్రమల్నీ వాటికి తలమానిక అయిన ఖద్దరునీ ప్రోత్సహించి తీరాలి.

1. Harijan D/9-7-38 P. 178.

"లాభాలరూపాన ప్రజలనుండి దోచుకున్న డబ్బంతా పెట్టుబడి దారుల వద్దనే వుంటుందికనక విప్లవం రాగానే ఆ డబ్బంతా ప్రభుత్వం వశపరచుకోవచ్చు. కనక యిప్పుడు తాత్కాలికంగా పెట్టుబడిదారి విధానాన్ని ప్రోత్సహిస్తే మట్టుకేం ?" అని యింకొక కుతర్కం బయలుదేరింది. ఆచరణలో బీదవాడి బీదరికాన్ని హెచ్చుచేసే పనులు చేస్తూ ఆ బీదవాడిచేతనే విప్లవం తెప్పిస్తామనుకోటం మరో మూర్ఖత.

ఈ సందర్భంలో యంత్రపరిశ్రమలు బాగా అభివృద్ధిజెందిన దేశాలలో కూడా గృహపరిశ్రమ తీవ్రంగా పెరుగుతోందని తెల్సుకోటం ఉత్సాహజనకంగా వుంటుంది. 1926 కి రష్యాలో పట్టణాల్లో చేతిపరిశ్రమదారులు 5 లక్షలమంది మాత్రమే వున్నారు. అంటే జనాభాలో 2·1% అన్నమాట. కాని 1931 లో వీళ్ళ సంఖ్య 20 లక్షలైంది. అంటే జనాభాలో 6·2% అన్నమాట.[1] జర్మనీలో చిన్నపరిశ్రమలలో పనిచేసే కార్మికుల సంఖ్య 1925 లో 54,98,230 లేక 29·6% నుంచి 1933 కి 57,84,017 లేక 39·7%కి పెరిగింది. పారిశ్రామికంగా సంఘటితపరచబడిన జర్మనీలోని కార్మికులలో దాదాపు 2/5 వంతు యీ చిన్న చిన్న పారిశ్రామిక సంస్థలలోనే పనిచేస్తున్నారు. ఈ సంస్థలలో అయిదేసి కంటె ఎక్కువమంది పనిచెయ్యరు.[2] కెనడాలోని 'కంటిన్ గైడ్' అనే పత్రికలోని ఒకవ్యాసంలో "క్విబెక్ లో 150,000 యిళ్లలోని స్త్రీలు రాటం మగ్గంమీద తమవస్త్రాల్ని తామే ఉత్పత్తి చేసుకుంటున్నారు" అని వ్రాయబడివుంది.[3] ఆధునిక కర్మాగారం జన.

---

1. **Sidney & Beatrice Webb in Soviet Communism— A new civilization.**
2. **Harijan I/ 7-3-37 P. 55,**
3. **M. D. in Harijan D/ 4-5-35 P. 91.**

సమ్మర్థంగల కేంద్రాల్లోంచి పల్లెటిదిక్కుకి పోతోంది.[1] ముక్ డిం ఉస్మాన్ అనే ఆయన "ఇంటర్నేషనల్ లేబర్ రివ్యూ" లో "టర్కీలోని చేతిపరిశ్రమలు" అనే శీర్షిక క్రింద వ్యాసంవ్రాస్తూ "ఇటీవలచేసిన అధ్యయనంవల్ల తేలిందేమిటంటే—పారిశ్రామికంగా వృద్ధిపొందిన దేశాల్లో కూడా యంత్రపరిశ్రమలతోపాటు వాటి పక్కనే చేతిపరిశ్రమలు సైతం వృద్ధిపొందుతున్నట్లు స్పష్టమవు తోంది. 1927 లో టర్కీలో 5 గురి కంటె తక్కువ మంది మాత్రమే పనిచేసే చిన్న చిన్న పారిశ్రామిక సంస్థలు 59,245 వుం డేవి. ఈ సంఖ్య పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థల సంఖ్యకంటె చాలా యెక్కువ. దేశంలోని అన్ని ఫ్యాక్టరీలు కలిసి ఉత్పత్తిచేసే నూలుబట్టకు మూడురెట్లు బట్టను నేతగాండ్రు ఉత్పత్తిచేశారు" అన్నాడు.[2]

పై అంశాలవల్ల ధనస్వామ్య దేశాల్లో కూడా యంత్రపరిశ్రమలు, గృహపరిశ్రమల్ని నాశనం చెయ్యలేకపోయాయని స్పష్ట మవుతోంది. దేశసౌభాగ్యంకోసమేపనిచేసే నిజమైనప్రజాప్రభుత్వం పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించినప్పుడు మానవవికాసానికి అవసరమైన గృహపరిశ్రమలు తప్పకుండా సంరక్షింపబడుతాయి.

యంత్రపరిశ్రమల విషయమై రచయితకీ ఆచార్య వినోబా భావేగారికీ జరిగిన సంభాషణలో, వినోబాభావేగారు వెలిబుచ్చిన అభిప్రాయంతో యీ ప్రకరణ ముగిద్దాం.

యంత్రాలవల్ల మిగిలిన విశ్రాంతిని ఎలా వినియోగిస్తారని శ్రీ వినోబాగారడిగితే "మట్టిరోడ్లమీద కంకరవేయిస్తాం. ఇంకా

1. **Socialist Sixth of the World P. 67.**
2. **Harijan D/ 11-1-35.**

తీరికప్పుంటే, తారు సిమెంటు, రబ్బరురోడ్లు వేయిస్తాం. పూరి గుడిసెల్ని మేడలుగా మారుస్తాం" అని రచయిత సమాధానం చెప్పగా "నయం, ఆ తరవాత వెండిరోడ్లు, బంగారురోడ్లూ వేయించరుగదా !" అని పరిహాసంగా అని "ఇంతకీ మీరు చెప్పే పారిశ్రామికవిధానం స్వరాజ్యం వచ్చి, ఉత్పత్తి సంస్థల్ని ప్రభుత్వం వశంచేసుకున్న తరవాతమాట. అంతవరకూ గ్రామపరిశ్రమల్ని పోషించండి. తరవాత చూచుకుందాం" అన్నారు వినోబా భావేగారు.[1]



1. ఆంధ్రపత్రిక 6-1-1942.

# గాంధిజం : సోషలిజం



## VII

## 5. కార్మిక నియంతృత్వం

హిందూసంఘంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే వర్ణాలున్నట్లే యితరసంఘాల్లోకూడా స్థూలంగా పురోహిత, భూస్వామి, బూర్జువా, కార్మికవర్గాలు వున్నాయి. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క వర్గంయొక్క ప్రాబల్యం వుండటం, ఆవర్గమే పెత్తనంచేయటం జరుగుతూ వుంటుంది. మొదట్లో పురోహితుల ప్రాబల్యంవుంటే, భూస్వాములవర్గం విప్లవం తీసుకువచ్చి ఆ ప్రాబల్యాన్ని అణుస్తుంది. తరవాత భూస్వాములే దోపిడి విధానం చేపట్టితే, బూర్జువాలు విప్లవంతెచ్చి అధికారాన్ని తమ హస్తగతం చేసుకుంటారు. ఆపైన బూర్జువాల దోపిడీవిధానాన్ని నిర్మూలించటానికి కార్మికవర్గం విప్లవంతెస్తుంది. ఇది తప్పనిసరి కనకనే "ప్రపంచచరిత్ర అంటే వర్గకలహాచరిత్ర" అని అన్నాడు మార్క్సు.

"సోషలిజం స్థాపించటానికి నాలుగోవర్గం అయిన కార్మికుల నియంతృత్వం తప్పనిసరి" అనికూడా అతివాదులంటారు చాలామంది. "సోషలిజం అంటే నాకు యిష్టం" అని ఎవరన్నా చెబితే "అయితే కార్మికనియంతృత్వానికి అంగీకరిస్తారా?" అని ప్రశ్నిస్తారు కొందరు. కార్మికనియంతృత్వం ఒక సాధనమాత్రమేనని

గుర్తించుకుంటే అంతకన్న మంచిసాధన యింకోటి కనిపిస్తే దాన్ని తేలికగా వదలటానికి శాస్త్రీయదృక్పథంగల ఆధునికుడు అంగీకరించితీరాలి. లెనిన్ "మనకార్యక్రమము" అనేదాంట్లో "మార్క్సుసిద్ధాంతం నిర్దుష్టమనిగాని, అనుల్లంఘనీయమనిగాని మేం యెంతమాత్రం భావించం" అన్నాడు. "ద్వంద్వాత్మక తత్వం దృష్టిలో, ఎల్లకాలానికీ స్థాపింపబడినదంటూ కాని, పరమపవిత్రమైనదంటూగాని ఏమీలేదు" అన్నాడు మార్క్సు. "నేను పడిన అభిప్రాయాలుగాని, నేను చేసుకున్న నిర్ణయాలుగాని, శాశ్వతం అని, నిర్దుష్టాలని అనుకోరాదు. అవసరమయితే రేపే నేను వాటిని మార్చుకోవచ్చు" అన్నాడు మహాత్మాగాంధీ. ఇంత స్పష్టంగా చెప్పబడినాకూడా కొందరు "మార్క్సిస్టుల"మని చెప్పుకునేవాళ్ళూ, గాంధేయులమని చెప్పుకునేవాళ్ళూ మూఢవాదం లోకి దిగటం ఆశ్చర్యంగానే వుంటుంది. విప్లవం వస్తేనేగాని సోషలిజం స్థాపించలేమని, ఆ విప్లవం దౌర్జన్యయుతమైనదే అయి తీరాలనీ అనుకోటంకూడాకద్దు. దీనివిషయమై ప్రస్తావిస్తూ రాల్ఫ్ ఫాక్స్ "అలాంటిపరిస్థితుల్లో వేరే విప్లవం లేకుండా క్రమ పరిణామంద్వారానే సోషలిజాన్ని జేరటం సంభవమే" అని రాశాడు.[1]

సంఘటల్నిబట్టి సాంఘికశాస్త్రం రచింపబడుతుంది కాని, సాంఘిక శాస్త్రాన్నిబట్టి సంఘటనలు జరగవు. ఒక వర్గంయొక్క అధికారాన్ని మరోవర్గం హస్తగతం చేసుకుంటుందనే సూత్రం మొత్తంమీద సత్యమే అయినా అవి ఒకే క్రమంలో అన్ని దేశాల్లోనూ ఒకేకాలంలో జరగదు. వర్గాలమధ్య జరిగే యీ యుద్ధాలు యంత్రవత్ సాగుతాయనీ, తుదినిర్ణయపు ఘడియ వచ్చేదాకా, ఒకపక్షం బలహీనమైపోతూనూ మరోపక్షం బలపడి

1. P. 78. Communism by *Ralph* Fox.

పోతూనే వుంటుందనీ అనుకోటంకన్న తెలివితక్కువదీ, ప్రమాదకరమైనదీ అయిన విషయం యింకోటి వుండదు.[1]

కొన్ని దేశాల్లో కొన్ని విప్లవాలు అసలు జరగకనే పోవచ్చు. అధికారంలోకి వచ్చిన ఆవర్గం, ఆ ట్రేడోపిడివిధానం అవలంబించకపోయినా, నిరంకుశంగా ప్రవర్తించకపోయినా, తగ వాతివర్గం విప్లవం తేవటం జరగదు. ఒక్కొక్క దేశంలో ఫ్యూడల్ ప్రభువుల ఆధిపత్యమూ, బూర్జువాల ప్రాబల్యమూ ఏకకాలమందే వుండవచ్చు. ఇద్దరిచేతా పీడింపబడే కర్షక కార్మికులు కలిసి విప్లవం తీసుకువచ్చి రెండువర్గాల్నీ ఏకకాలమందే నిర్మూలించవచ్చు. అలాంటప్పుడు బూర్జువాల విప్లవం రానేరాదు.

"ప్రొలెటేరియట్" అంటే బస్తీలలోని ఫ్యాక్టరీకూలీలు మాత్రమేనని అర్థంలేకపోయినా "ప్రొలెటేరియన్ డిక్టేటర్‌షిప్" అనే పేరుతో ఫ్యాక్టరీ కూలీకే ఎక్కువ ప్రాధాన్యం యివ్వటం, రైతుని చిన్నచూపు చూడటం జరుగుతోంది. "రష్యాలో పారిశ్రామిక కార్మికుడు ఒకరకంగా ప్రభువై కూర్చున్నాడు. అతని నెత్తిమీద దేవత కమ్యూనిస్టుపార్టీ మెంబరు" అంటాడు కాట్‌స్కీ.[2] "1927 నాటి రాజ్యాంగప్రణాళిక ప్రకారం రష్యాలో ప్రతికార్మికుడికీ ఓటుంది. కాని రైతుల్లోమటుకు ప్రతి ఏ గురికి ఒక్క ఓటుమాత్రమే. (1937 లో యీస్థితి మారింది.) ...రష్యాలో రైతులు తమవర్గసంఘాల్ని ఏర్పరచుకుంటానికి వీలులేదు."[3]

ఇండియాలాంటి వ్యవసాయప్రధాన దేశాల్లో రైతులికి ప్రాధాన్యంవుండే విప్లవకార్యక్రమం, నినాదాలూ పనిచేస్తాయి

1. *P.* 20 **Communism by Ralph Fox.**
2. **P. 97 Bolshevism at deadlock.**
3. **Kisans and Communists by *Prof.* N. g. Ranga**

కాని ఫ్యాక్టరీకూలీల ప్రాధాన్యంవుండేవి అట్టే ప్రయోజనకరం కాదు. "అతివాదులైన కొందరు మార్క్సిస్టులు రైతులు పెట్టీబూర్జువాలనీ అందువల్ల విప్లవ నిరోధకులనీ అంటున్నారు కూడాను. ఒకప్రక్క కార్మికులకూ, పెట్టీ బూర్జువాయిజీకీ, మరొకప్రక్క వీరిద్దరికీ కర్షకులకూ వర్గసంఘర్షణ ఉండటానికి ఎక్కువ అవకాశాలున్నాయి. కనక వర్గపోరాటాన్ని పెంచి తద్వారా సామ్రాజ్య వ్యతిరేకపు పోరాటాన్ని బలపరుస్తామనటంలో అర్థంలేదు" అంటున్నాడు యం. యన్. రాయి.[1] బూర్జువా, పెట్టీ బూర్జువా, ప్రొలెటేరియట్ అనే పదాలు వాడుతున్నాం కనక వాటి సరైన అర్థాలు తెలుసుకోటానికి ప్రయత్నించాలి.

బూర్జువాయిజీ అనేది ఫ్రెంచి శబ్దం. దీనికి పట్టణవాసి అని అర్థం. పట్టణాల్ని ఫ్రెంచిభాషలో 'బరగ్స్' అనేవాళ్లు. బరగ్సులో వుండేవాళ్లని బూర్జువాయిజీ అనేవాళ్లు. ఈ బర్గులు పెట్టుబడిదారీ ఉత్పత్తికి కేంద్రాలుగా ఉండేవి. ఇలా బయలుదేరిన కేంద్రాలు త్వరితంగా విజృంభించి జమీందారీవిధానాన్ని ధ్వంసం చేశాయి. కాని ఇప్పుడు సాధారణంగా డబ్బున్నవాళ్లందరినీ బూర్జువా అని పిలవటం పరిపాటైపోయింది. ప్లీడరైనా డాక్టర్నీ అయినా, జమీందారైనా, వర్తకుడైనా, వడ్డీవ్యాపారం చేసేవాడైనా—డబ్బుంటేసరి బూర్జువా అనేస్తున్నారు. వారందరినీ ఒక వర్గంగా పరిగణించటం చాలా పొరపాటు.

కొందరు రైతులు భూమిని వదలిపెట్టి పట్టణాలకి చేరుకున్నారు నూతన ఉత్పత్తిసాధనాలతో పనిచెయ్యటానికి. అయితే వీరంతా భాగ్యవంతులు కారు. భాగ్యవంతులిదివరకే పట్టణాల్లో స్థావరం ఏర్పరుచుకొనివున్నారు...పొలాలలో చాకిరీ చేసుకునేవారు డొక్కనిండక పట్టణాలలో పనిచేసి బ్రతకటానికి వెళ్ళారు. ఈ పేద

వారినే పెట్టీ బూర్జువాయిజీ అన్నారు. పెటీ అనే ఫ్రెంచి శబ్దానికి 'చిన్న' అని అర్థం.

పేదవాళ్లందర్నీ ప్రొలెటేరియట్ అంటానికి వీలులేదు. పట్టణాల్లో కూలినాలి చేసుకుంటానికి జేరిన రైతుల్ని ప్రొలెటేరియట్ అంటానికి వీలులేదు.[1]

స్వంత ఆస్తి లేకపోవడమే కాకుండా అలాంటి స్వంత ఆస్తిని తిరిగి సంపాదించుకునే అవకాశాలు కూడా వుండనప్పుడే కార్మికుడవుతాడు. అందువల్ల పొలంలేని రైతుని కార్మికుడనటానికి వీల్లేదు...అతడు ఎక్కడికోవెళ్లి ఏ నాలుగైదువందలో వెనకేసుకుని మళ్లీ భూమి కొనుక్కోవచ్చు. కాని కొన్ని పరిస్థితుల్లో వ్యవసాయకూలీలు కార్మికవర్గంలోచేరతారు.... కనక సరైన శాస్త్రీయ దృక్పథంతోచూస్తే నేటి హిందూదేశంలో కార్మికుల సంఖ్య స్వల్పము దాదాపులెక్కలోకి వచ్చేదికాదనీ తేలుతోంది.

హిందూదేశంలో నేడువచ్చే విప్లవానికి నాయకత్వంవహించే గౌరవం బూర్జువాయిజీకిగాని, కార్మికులికిగాని సంక్రమించదు. ఇప్పుడిప్పుడే బయలుదేరుతూవున్న కార్మికులికి ప్రథమశ్రేణిలో వుండె పోరాడే పెటీ బూర్జువాయిజీకీ యీ వర్గంలో కేవలం అంతర్భాగంగా పనిచేసే కార్మికులకూ సంక్రమిస్తుంది.

శ్రామిక, కర్షక, పెటీబూర్జువాల ముస్తరికీ పెటీబూర్జువా వర్గం ప్రతినిధిగా వుంటుంది. వీరి లాభాలే జాతికంతకూ లాభాలుగా వుంటాయి. వీరే మన విప్లవసైనికులు.[1]

---

1. మన వర్గసంబంధాలు by యం. యన్. రాయి.

పై అంశాలతో పూర్తిగా ఏకీభవించినా, ఏకీభవించక పోయినా యీ విషయాలు మాత్రం స్పష్టమవుతున్నాయి. 1. మన దేశంలో వర్గాల్ని కచ్చితంగా రెండుగా విభజించటానికి వీల్లేదు. 2. ఒకవర్గపు ప్రయోజనాలు సంపూర్ణంగా ఇంకోవర్గపు ప్రయోజ నాలకి వ్యతిరేకంగా లేకపోవటంచేత వర్గకలహాన్ని రేపటంవల్ల సామ్రాజ్య వ్యతిరేక సంయుక్తపోరాటానికి విద్రోహం జరుగుతుంది. 3. అత్యల్పంగావున్న కార్మికుల నియంతృత్వం వాంఛనీయంకాదు.

కాని మార్క్స్ "విప్లవానంతరం కార్మిక నియంతృత్వం ఏర్పడి సోషలిస్టు కార్యక్రమం అమలులోపెట్టుతుంది. తరవాత క్రమంగా వర్గరాహిత్యసమాజం ఏర్పడినప్పుడు ప్రభుత్వం అనేది దానంతట అదే రాలిపోతుంది" అని అంటాడు. గాంధేయుల కీ విషయమై చాలా సందేహాలున్నాయి. 'అధికారమే అక్రమ మైంది. సర్వాధికారం మరీని' అన్నాడు లార్డ్ ఆక్టన్. 'అసలు పరిపాలించనే పరిపాలించని ప్రభుత్వం ఉత్తమప్రభుత్వం' అన్నాడు ఒక అమెరికన్ రాజ్యాంగవేత్త. కాని "అమితంగా కేంద్రీకృతమైన నియంతృత్వ ప్రభుత్వం యుద్ధంవల్లనో, నిమ్నశ్రేణి లోంచివచ్చే విప్లవంవల్లనో కూలదోయబడుతుందితప్ప క్రమంగా వాడి రాలిపోతుందనుకోటాని కేవలమాత్రం అవకాశంలేదు" అన్నాడు హక్స్లే. "రష్యాలోవున్నది కార్మికనియంతృత్వంకాదు, కార్మికుల మీద నియంతృత్వం" అన్నాడు జాన్‌గంథర్.[1] నియంతృత్వం అంటే ప్రత్యక్షంగా హింసమీద ఆధారపడిన ప్రభుత్వం. ఏ చట్టా నికీ లొంగివుండదు. రష్యాలో కమ్యూనిస్టులు పాలకవర్గం. ఇతరులికి లేని సౌకర్యాలు పార్టీమెంబర్లకివున్నాయి. వాళ్ళు పత్రికలు వెయ్యవచ్చు. సంపద కూడ బెట్టుకోవచ్చు. బూర్జువాల మాది రిగా జీవితాన్ని గడపవచ్చు. నీతినియమాలులేని వంచకులనుగా

1. P. 21 'Gandhian Constitution.'

ప్రజల్ని తయారుచేసే ఒకవిధానంగా పరిణమిస్తోంది కమ్యూనిజం. మార్క్సురచనల్ని ఓమూల పవిత్రమైన మతగ్రంథాలుగా పరిగణిస్తున్నారు. కమ్యూనిస్టులు కాని విద్యాధికులు చంపివేయబడ్డారు.[1]

అచటి రాజకీయజీవితం, బహిరంగచర్చలికి తగినంత స్వేచ్ఛని అంగీకరించదు.[2] మార్క్సుయొక్క భౌతిక వాదానికి వ్యతిరేకించే వ్యక్తి చరిత్రా ప్రచురించటానికి వీల్లేదు.[3] ఇకనుంచీ కమ్యూనిస్టులో వారు యిష్టపడినవారో తప్ప యితరులెవరూ అభ్యర్థులుగాగాని ప్రతినిధులుగాని వుండరు. ఆఖరికి, వారికి వ్యతిరేకంగా మాట్లాడే వ్యక్తే లేవుండదు.[4] వెనకముందులాలోచింపని నిర్దాక్షిణ్యమైన జి. పి. యు. రహస్యపోలీసుశాఖ సాయంతో అక్కడ నియంతృత్వం సాగుతోంది. జి. పి. యు. విధానాన్ననుసరించే హిట్లరు గెస్టాపో రహస్యపోలీసుశాఖని నిర్మించాడు. అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీని రద్దుచేసీ అంతర్జాతీయ గీతాన్ని విడనాడీ నేడు రష్యా పూర్తిగా జాతీయపంథాని అవలంబించింది. క్రమంగా సోషలిస్టుసామ్రాజ్యమో, కామన్వెల్తో పెంపొందుతోంది.[5] 'రష్యా మహిమాన్విత దేశమని నాజీలధోరణిలో ప్రచారం చెయ్యబడుతోంది.[6] నియంతృత్వం, అధికారాన్ని వదులుకొని స్వాతంత్ర్యం ప్రసాదించటానికి ఎన్నడూ అంగీకరించదు.[7] బహిరంగ

---

1. **'Bolshevism at a deadlock' by Karl Kautsky.**
2. **Walter Citrine in "I search for truth in Russia' quoted by G. L. Khanna,**
3. **P, 182 'Life under the Soviets.'**
4. **'Bolshevism at a deadlock' P. 118,**
5. **Masani.**
6. లూయిఫేషర్
7. *Prof,* **Joad.**

ప్రదేశాలలోగల లెనిన్ మహాశయుని చిత్రాల నావలతోసి, వాని స్థానాలలో స్టాలిన్ చిత్రాలు నెలకొల్ప బడ్డాయి. ...ఫ్యాక్టరీలలో 'స్టాకినో విజమ్' ఏర్పడింది. అంటే ఎవరికి వారే శక్తికొద్దీ పనిచేసేవిధానం. కూలీలలో ఒకరి కొకరికిపోటీ పెట్టి ఎక్కువ కష్టపెట్టి పనిచేసేందుకు ఏర్పరచబడిన విధానం యిది. పరీక్షాపద్ధతులు మళ్ళీ సిద్ధమయ్యాయి. పాఠశాలలనెలుపలా, బైటా, విద్యార్థుల ఉపన్యాసాలూ, వారిచర్యలూ కనిపెట్టి ప్రభుత్వమువారికి తెలపటానికి, కమ్యూనిస్టు యువకసంఘం వారు నియమింపబడ్డారు. జర్మనీలో లాగా పుస్తకాల్ని బహిరంగంగా తగలపెట్టలేదు. కాని పుస్తకభాండాగారాల్లో 'అనవసరమైన' పుస్తకాల్ని తీసివేసి, వారివిధానాన్ని బలపరిచే నూతన గ్రంథాల్ని రాసి నెలకొల్పారు. తీసేసిన గ్రంథాల్లో లెనిన్ మహాశయుడు కొనియాడిన జాన్‌రీడ్స్ యొక్క "టెన్ డేస్ దట్ షుక్ ది వరల్డ్" ఒకటి. దాంట్లో, లెనిన్‌తో ట్రాట్‌స్కీ పేరుకూడా తరుచు ఉదహరించడమే, దాన్ని తొలగించటానికి కారణం. చిత్రశాలల్లో ట్రాట్‌స్కీ బొమ్మే కనిపించదు.

నవంబరు 6, 1935 నాటి ప్రవదా పత్రికవల్ల సోవియట్ గనులలో, స్టాకనోవిస్టు కానటువంటి గనితవ్వేవాడు, 400 నుంచి 500 రూబుల్సు వరకూ పంపాదించాడని, స్టాకనోవిస్టు, 1000 రూబుల్సుకు పైనే సంపాదించాడని తెలుస్తుంది....ఒక గనికూలీ కంటె మరొకడు పదిరెట్లు ఎక్కువ సంపాదిస్తున్నాడని తెలుతోంది. తెలివితేటలు లేని కూలీకంటె, ఇంజనీర్లు స్పెషలిస్టులు, 80 రెట్లు అధికంగా సంపాదిస్తున్నారు. అలానే పిన్‌యాక్ అనే ప్రఖ్యాతరచయిత 30,000 రూబుల్సు, ప్రతినెలా, రాయల్టీస్ క్రింద సంపాదిస్తున్నాడు. ఇప్పుడు కొంత మంది రష్యను పౌరులు కలిసి వాళ్లయిష్టంవచ్చినన్ని 'స్టేట్ బాండ్స్' కొనుటకు అర్హులయ్యారు. ఈబాండులకి 7% వడ్డీ యిస్తారు. ఎథిల్‌మేన్

ఆనే ప్రఖ్యాత ఆంగ్లేయుకవయిత్రి "మోలాటావ్ భార్యకంటే కష్టాలలో గొప్పదయినది లేదు. ఆమె భాగ్య భోగ్యాలతో తుల తూగుతుంటే, ఆమె కుటుంబ సేవకులు దుర్భరావస్థలో జీవిస్తున్నా" రని వ్రాసింది.

40 మొదలు డెబ్బైలక్షల మధ్యలో ఏకైక సేద్యానికి భూమినివ్వటానికి ఒప్పుకోని "కులక్స్" అంటే గౌరవనీయులైన కర్షకులున్నా, యాభై మొదలు నూరులక్షల మధ్యంలో స్టాలిన్, కలినిన్, వొరొషిలో తప్ప ప్రఖ్యాతిజెంది మిగిలిన విప్లవంలో పాల్గొన్న కమ్యూనిస్టులతో సహా రాజకీయ వ్యతిరేకులున్నా యీ జి. పి. యు. సర్వాధికారత్వానికి బలికాబడినవారేనని పెక్కు నిరూపణలవల్ల తెలుస్తోంది. "స్టాలిన్ స్రవింపజేసిన అమాయకుల రుధిరధారలు ' ఒక సరస్సు నిండుతుంది. హిట్లరు ఒలికించిన నెత్తుటిధార ఒక చిన్న కొలను అవుతుంది. ముస్సోలిని కార్పించిన రక్తం ఒక చెరువు నిండుతుంది" అని మేక్స్ ఈస్టిమన్ చెప్పాడు.

మోన్షియుర్ స్టాలిన్ (గౌరవనీయుడైనస్టాలిన్) అని ఎండ్రిగైడ్ ఒక తంతివార్త పంపిస్తే అధికారులు ఆ వార్తను అందజేయలేదు. కారణం:- తపాలాధికారులు "అధికుడగు ప్రియమయిన స్టాలిన్ గారికి" అని రాస్తేనే తప్ప అంగీకరించరు. లెనిన్ తుది దినాలలో 'స్టాలిన్ మోటవాడు, రాజద్రోహి, చంచలచిత్తుడు, జాతీయవాది, ద్వేషి— కనక అతణ్ణి జనరల్ సెక్రిటరీగా ' తొలగించాలని సిఫారసు చేశాడు.

1935 తరువాత సోవియటు యూనియనువారు, రాజ్యాధికారంలో వున్న ఫ్రాన్సు బ్రిటనులతో కలిసి 'దోపిడీగాండ్రముఠా' అని స్టాలిన్ చేతనే నిరూపించబడ్డ లీగ్ ఆఫ్ నేషన్సులో పాల్గొనటానికి నిర్ణయించుకున్నారు.

స్టాలిన్-హిట్లరు సంధిపత్రాలపై సంతకాలు చేసుకొన్న తరువాత రష్యా ప్రధానమంత్రిఅగు మోల్టొని "గర్భశత్రుత్వంగల ఫాసిజానికి, కమ్యూనిజానికి ఏ విధంగా సమాధానం కుదిరింది" అని ప్రశ్నిస్తే "ఇదంతా అభిరుచిపై ఆధారపడివుంది?" అని సమాధానం చెప్పాడు.

ఇప్పుడు రష్యా జాతివిహీనంగానూ లేదు, అక్కడ ప్రజాప్రభుత్వమూ లేదు, అంతర్జాతీయతా లేదు. నేడు రష్యాను సామ్యవాద రాజ్యమని ఒక మూర్ఖుడు పిలిస్తే పిలవవచ్చు.[1]

రష్యా పత్రికా స్వాతంత్ర్యం అనేది ఎరగనే ఎరగదు.[2] కార్మిక నియంతృత్వం అమలులోవున్న రష్యాలోని పరిస్థితులని చెప్పడానికే కొన్ని అంశాలు పైన పేర్కొనబడ్డాయి. అవి అన్నీ అక్షరాలా విశ్వసనీయం కాకపోవచ్చు. అయినా నియంతృత్వం అనేది ఏ వైపుకి మొగ్గుతుందో పై విషయాలవల్ల గ్రహించవచ్చు. ఈ విషాద సంఘటనలన్నీ మనదేశంలో కూడా జరగకుండా వుండాలంటే విప్లవ విధానంలోనూ విప్లవానంతర ప్రభుత్వ పద్ధతిలోనూ మార్పు చేసితీరాలి. అలా మార్పు చెయ్యటానికి వీల్లేదు అనడం మూర్ఖం. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యక్రమంలో కూడా 'చీనా ఇండియాలాంటి దేశాల్లో ముఖ్యంగా చెయ్యవలసినపని కర్షకవిప్లవాన్ని పెంపొందించటం' అని చెప్పబడివుంది.

రాజ్యాంగవిధానంలో గాంధీజీ ఆదర్శంకూడా ఒక విధమైన అరాజకమే. అహింసాయుతమైన సంఘంలో ఎవరి కర్తవ్యాన్ని వారు గుర్తించి నడుచుకుంటారుకనక అసలు ప్రభుత్వమే అవసరంవుండదు. కాని మధ్యకాలంలోఅయినా ప్రజాస్వామికానికే గాంధీజీ అనుకూలంకాని, నియంతృత్వానికి కాదు. లింకన్ చెప్పి

1. 'Socialism reconsidered' by M. R. Masani.
2. Kent Cooper quoted by Baltiisky in P. 27.. Marxism & Democracy.

న్నట్లు 'ప్రజలచేత, ప్రజలకోసం స్థాపించబడిన ప్రజాప్రభుత్వమే ప్రజాస్వామికం.' కాని, 'ప్రజాస్వామికం క్రమంగా కొందరు సోమరులచేతుల్లో పడిపోయే అవకాశం వుండికనక నేను తత్వవేత్త అయిన రాజుయొక్క చైతన్యవంతమగు నియంతృత్వమే ప్రజాస్వామికంకంటె మంచిదని చెబుతా'నంటాడు ప్లాటో. "అసమర్థుల విధానం ప్రజాస్వామికం" అని విమర్శించాడు షేకెట్. "ప్రజలు ఎద్దుల్లాంటివారు. వాళ్లకి ఓకాడి, ములుకర్ర, గడ్డికావాలి" అని హేళనచేశాడు వాల్టేర్.[1]

ప్రజాస్వామికం "మూకలరాజ్యం" అయ్యే ప్రమాదం లేకపోలేదు. అయినా నియంతృత్వంకంటె వెయ్యిరెట్లు మెరుగు. ఒక్కడి స్వార్థంకంటే పదిమంది స్వార్థం తక్కువ హానికరంగా వుంటుంది. ఒక్కడి మూర్ఖతకంటె పదిమంది మూర్ఖత ఎక్కువ వివేకవంతంగా వుంటుంది. కనక ప్రజాస్వామికమే తక్కువ నష్టదాయకం. అందుకనే, ఎంతటి నిరంకుశ నియంత అయినా కూడా, తన అత్యాచారాలికిసైతం ప్రజలఅంగీకారం వుందని ప్రకటించుకోటానికీ, నయానో భయానో తనచర్యలికి, ప్రజల అంగీకారాన్ని పొందటానికీ ప్రయత్నిస్తాడు. కార్మికనియంతృత్వం అయినా, సక్రమమైన ప్రజాస్వామికాన్ని ఏర్పరచటానికి తాత్కాలికంగా అవలంబింపబడే ఒక సాధనకాని, సిద్ధి కాదు. సాధనా సిద్ధీ పర్యాయ పదాలనే సిద్ధాంతంగల గాంధీజీ సిద్ధికేమాత్రమూ దగ్గరలో లేని నియంతృత్వాన్ని సాధనగాకూడా ఎన్నడూ అంగీకరించడు.

కార్మిక నియంతృత్వంవల్ల కలిగే లాభనష్టాలు చర్చించు కున్నాం. అనియంతృత్వం ఒచ్చితీరాలని ఎలా అనమో రానే

---

1. *P.* 23. **'Gandhian Constitution.'**

రాకూడదనీ అలాగే అనరాదు. కార్మికకర్షకవర్గం తగినంత చైతన్యం పొందని చాలిసదేశాల్లో, పరప్రభుత్వాన్ని పారదోలే పోరాటానికి ఒక్కొక్కప్పుడు బూర్జువానియంతృత్వాన్ని కూడా అంగీకరించాల్సిన పరిస్థితులేర్పడవచ్చు. లేకపోతే, కర్షక ప్రాధాన్యం గల దేశాల్లో కర్షకనియంతృత్వమే ఏర్పడవచ్చు. అంతమాత్రం చేత పరిస్థితుల ఒత్తిడీ, దేశకాలాల స్వభావాన్నీ గుర్తించకుండా, మార్క్సో, గాంధీజీయో చెప్పారనో చెప్పలేదనో, కార్మిక నియంతృత్వాన్నిగాని, యింకో విధానాన్నిగాని, ఆమోదించి తీరాలనో, తిరస్కరించి తీరాలనో అనడం శాస్త్రీయ దృక్పథంతో విషయ పరిశీలనచేసే విద్యార్థికి భావ్యంకాదు.



# గాంధిజం : సోషలిజం



## VIII

## సోషలిజాన్ని గురించి గాంధీజీ ఏమంటున్నాడు?

గాంధిజం, సోషలిజం పరస్పర వ్యతిరేక వాదాలని సర్వసామాన్యంగా భావించేవాళ్లు, గాంధీజీ స్వయంగా సోషలిజాన్ని గురించి ఏమి చెప్పాడో విచారిస్తే తమభావాల్ని తప్పకుండా మార్చుకోవాలి వస్తుంది. అనేక సందర్భాల్లో గాంధీజీ 'వర్గరహితసమాజం స్థాపించబడటం తనకిష్టమే'నని 'జమీందారీ విధానం నశిస్తే సంతోషించే వాళ్లలో ప్రథముడు తానే'నని చెప్పాడు. "బోల్షివిజం అంటే వర్గరహిత సమాజం. చేరటానికి కృషిచేయదగ్గ ఆదర్శం అది". "నిజమైన సోషలిజాన్ని మనపూర్వీకులే మనకినేర్పిపెట్టారు. 'భూమి అంతా గోపాలునిది. ఇక దానికి సరిహద్దు గీతలెక్కడుంటాయి? మనిషే ఆహద్దుల్ని సృష్టించాడు. కనక మనిషే వాటిని తుడిచేసెయ్యొచ్చు.' అని బోధించారు. ఆధునిక కాలంలో గోపాలుడంటే ప్రభుత్వం. అనగా ప్రజలేనన్నమాట." "నేను పెట్టుబడిదారీవిధానంతో యుద్ధంచేస్తా. నేను అహింసావిధానంతో పెట్టుబడిదారి విధానాన్ని నశింపచెయ్యగోరుతున్నా". "శరీరశక్తి గల ఒక్కమనిషి, నిరుద్యోగిగా గాని, నిరాహారుడుగా గాని ఉన్నంతకాలం మనం సుష్టుగా భోజనం చెయ్యటానికి సిగ్గుపడాలి"[1]

---

1. 'Mind of Mahatma Gandhi'

‘నేనుకూడా సోషలిస్టునే అని చాటుతున్నా’[1] ‘ముందుకు పోయే సోషలిస్టు, కమ్యూనిస్టు మాదిరిగా నేనుకూడా ధనికతత్వాన్ని దాదాపు పూర్తిగా తుదముట్టించాలని కోరుతున్నా. కాని మా భావాలూ, భాషా వేరువేరు.[2] భారతదేశంలో చాలామందికంటె ముందుగానే నేను సోషలిస్టునయ్యానని చాటుతున్నా[3]. నా దృష్టిలో ఆస్తిని కలిగివుండడమే మహాపరాధం. ఆకలిగొన్నవాడికివ్వడం దానం కాదు. అది న్యాయ నిర్వహణ[4]—ఇవీ గాంధీజీ వెల్లడించిన భావాలు.

—క్రైస్తవ సంపన్నులతో సంభాషిస్తూ “నాకు అహింసాత్మకమగు కమ్యూనిజంలో నమ్మకముంది” అని చెప్పాడు గాంధీజీ. ‘సోషలిజం, కమ్యూనిజంకూడా ఈశోపనిషత్ లోని ప్రథమశ్లోకంలో ప్రస్ఫుటంగా ప్రచారం చేస్తున్నాయి. శాస్త్రీయసామ్యవాదాన్ని ఎదుర్కొన్నా ఆ సత్యాన్ని పరిష్కరించడానికే నేనూ పనిచేస్తున్నా” అన్నాడు గాంధీజీ.[5]

“కమ్యూనిస్టుకి అహింసయందు నమ్మకమున్నా అహింస ద్వారా సోషలిజం సిద్ధించడం సాధ్యం కాకపోతే యితరవిధానాలద్వారా సిద్ధించినా అంగీకరిస్తాడు. కాని నేను మాత్రం అహింసావిధానంద్వారా కాకపోతేనిరాకరిస్తా.”[6]

పై అంశాలవల్ల గాంధీజీ సోషలిజంయొక్క గాని కమ్యూనిజంయొక్కగాని ఆదర్శాలకు వ్యతిరేకి కాదని ఆ ఆదర్శాల్ని

1. ‘Gandhiji’ P. I03
2. Harijan D/16-12-39
3. Harijan D/20-4-1940
4. ‘Gandhi and Gandhism’ Pp. 233, 285
5. Harijan D/20-2-37
6. Gandhiji in Harijan D/13-2-37

చేరటాని కవలంబించే సాధనమాత్రం అహింసాయుతంగా వుండాలని కోరుతాడనీ స్పష్టమవుతుంది. గాంధీజీ బీదలవున్నడిస్వాన్ని ప్రశ్నించి కాకుండా బీదలయొక్కయూ, ధనికులయొక్కయూ సాంఘిక న్యాయబుద్ధికీ, హృదయానికీ ప్రబోధించి దోపిడీ విధానాన్ని నాశనం చెయ్యగోరుతాడు.[1]" గాంధేయ ప్రణాళికలో "భూమినంతా ప్రభుత్వపరం చెయ్యాలి, దున్నేవాడికీ ప్రభుత్వానికీ మధ్య దళారీ వుండరాదు. సహకార సేద్యాన్ని ప్రోత్సహించాలి" అని వ్రాయబడివుంది. ఆ పుస్తకానికి గాంధీజీ అంగీకారం తెలిపాడు మొత్తంమీద.

అయినా కూడా గాంధీజీని సరిగా అర్థంచేసుకోని కొందరు గాంధేయులూ, అర్థం చేసుకొంటానికి తగినంత నిదానం లేని కొందరు అతివాదులూ, అర్థమైనప్పటికీ విపరీతార్థాన్ని ఆపాదించే స్వార్థపరులు కొందరూ గాంధిజానికీ సోషలిజానికీ మధ్య పెద్ద పెద్ద కొండలు పేర్చి భారతరాజకీయ వాతావరణాన్ని యథాశక్తిగా కల్లోలపరిచారు. ఎవరికిష్టంవున్నా ఎవరికిష్టంలేకపోయినా ఈ రెండు వాదాలూ సమ్మేళనం పొందితీరుతాయి. ఆ సమ్మేళనానికి స్పష్టమైన రూపం యిచ్చి పాశ్చాత్యదేశాలికి పంపాల్సిన బాధ్యత భారతీయులమీద వుంది.

వ్యావహారికదృష్టితో చూచినా గాంధిజీని కాని సోషలిజాన్ని కాని వ్యతిరేకిస్తూ ప్రజలలో కెళ్లడం అసాధ్యమని తెలుస్తుంది. నిజంగా సరికొత్త విషయమయినా "పూర్వంనుంచీ వున్నదే. మధ్యమరచిపోయాం" అని చెప్పడంవల్ల ప్రజాసామాన్యం చెవియొగ్గుతుంది. అలాంటప్పుడు నిజంగా పూర్వకాలంలో

1. 'Gandhiji' P. 107

[illegible] అమలులో వుండే సోషలిజాన్ని "ఇది సరికొత్త సరుకు. మార్క్స్ చెప్పిన కొలతల ప్రకారం రష్యాలో తయారుచేశారు తీసుకోండి" అంటే ప్రజలు అంగీకరించనే అంగీకరించరు. పూర్వకాలంది [illegible] సోషలిజం అనీ, తమది శాస్త్రీయ సోషలిజం అనీ పేర్లు పెట్టుకుని గాంధీజానికీ సోషలిజానికీ వుండనుకునే భేదాన్ని పెద్ద [illegible] నిజంగావున్న సామ్యాన్ని గుర్తించకుండా సంచరించడంవల్ల ఏలాంటి మేలూ కలగదు. ఈ సత్యాన్ని అతివాదులతోపాటు మితవాదులుసైతం గుర్తించాలి.



# గాంధిజం : సోషలిజం



## రెండో భాగము

## ప్రతిఘటనా విధానాలు

ఇంతవరకూ గాంధీజానికీ సోషలిజానికీ గల ఆదర్శాల్లోనూ సిద్ధాంతాల్లోనూ వున్న సామ్యాల్నీ వైరుధ్యాల్నీగురించిచర్చించాం. ప్రస్తుత పరిస్థితులలో ఆ ఆదర్శాల్ని జేరటానికి అవలంబించే విధానాల విషయం యిప్పుడు పరిశీలిద్దాం. గాంధీజీయొక్క ఆయుధాగారంలో హరితాళం, సాత్వికనిరోధం, సహాయనిరాకరణం, శాసనోల్లంఘనం, సత్యాగ్రహం, నిరశనవ్రతం అనే ఆయుధాలున్నాయి. పైమాటల్లో ఆధ్యాత్మిక వాతావరణం కనిపిస్తుంది. కాని యిండియా లాంటి పీడితదేశాల్లో అవే ఎంతో ఫలప్రదాలనే సంగతి ఎవరూ కాదనలేరు. ప్రహ్లాదాదులు మనదేశంలో యీ విధానాలు అవలంబించారనే సంగతి అలావుండగా పాశ్చాత్యదేశాల్లోకూడా వీటికి ఉదాహరణలు లేకపోలేదు. జీసస్ క్రీస్తు, పాల్, పీటర్ వాల్డో, వైక్లిఫ్, జార్జిఫాక్సు, హస్, మెనోసైమన్స్ జాన్‌వూల్ మన్, విలియంపెన్, సెంట్ థామస్ ఎక్వినస్ మొదలైనవారు అహింసావిధానాన్ని ప్రబోధించారు. హంగరీలోని ఫ్రాన్సిస్ డీక్ తన మాతృభూమిమీదికి దండెత్తివచ్చిన ఆస్ట్రియనులను యీ విధంగానే నిరోధించాడు. 1940 నవంబరులో యూరప్ దేశాలు తమలోతాము శాంతిని స్థాపించుకునేందుకు ప్రోత్సహించడానికి గాను వారంరోజులు ఉపవాసం చెయ్యటానికి నిశ్చయించాడు

షాప్.[1] అతివాదులుకూడా అనేకమార్లు జైలులో నిరశనవ్రతం పూనడం యిటీవల మనం గమనిస్తూనేవున్నాం. భయం అంటు జాడ్యం. అలాగే నిర్భయంకూడాను. గాంధీజీ ఉద్యమాలు యీ రెండో జాడ్యాన్ని బాగా పెంచాయి.

ప్రజానీకంయొక్క దైనందినకష్టాల్ని నివారించేందుకు ప్రయత్నిస్తూ క్రమంగా వారి సానుభూతిని సంపాదించుకుని, వారి దృష్టిని రాజకీయాలవైపుకి మరల్చి, జనరల్ సమ్మెలద్వారా, తగిన సమయంలో ప్రజావిప్లవం లేవటం అతివాదుల ఆశయం. ఈ ఆశయం నెరవేరటానికి దేశంలో ప్రజాభిమానాన్ని చూరగొన్న పక్షాలతోనూ, వాటి ఉద్యమాలతోనూ సహకరించటం తప్పనిసరి. వలసదేశాల్లో ముందు జరగాల్సిన పోరాటం పరప్రభుత్వంతో. పరప్రభుత్వంపోతే తమకీ లాభమేకనక ఆపోరాటంలో కొంతవరకు దేశీయ పెట్టుబడిదారులుకూడా పాల్గొంటారు. అదీగాక దేశభక్తిచేత ప్రబోధింపబడిన యితర వర్గాలుకూడా యీ స్వాతంత్ర్య పోరాటంలో ముందుకొస్తాయి. ఒకవిధంగా ఆలోచిస్తే "చైతన్యం పొందని కార్మిక కర్షక వర్గాలే యీపోరాటంలో అంత ఉత్సాహంగా ముందుకురావు మొదట్లో" అని చెప్పాలిసొస్తుంది. స్వాతంత్ర్య పోరాటం బ్రహ్మాండంగా జరగటానికి కార్మిక కర్షక వర్గాల్లో మంచి చైతన్యం కలిగించడం ఎంత అవసరమో, స్వాతంత్ర్య పోరాటం పూర్తయ్యేదాకానన్నా పురోగామివర్గాల్తో సహకరించటానికి అవకాశంవున్న యితర వర్గాల్ని దూరంచేసుకోకుండా వుండటం కూడా అంతే అవసరం. ఈమొదటి పోరాటంలోనే ఏసోషలిజమో, కమ్యూనిజమో ఆదర్శంగా పెట్టుకుంటే విదేశీయ సామ్రాజ్యతత్వంతో పోరాడటానికి సంయుక్త ప్రతిఘటన సాధ్యంకాదు. పైగా పెట్టుబడిదారి

1. 'Gandhi and Gandhism,'

వర్గాలూ, వాటికి సన్నిహితంగావుండే "పెట్టీబూర్జువాలూ" సంయుక్త ప్రతిఘటనలో చేరకపోవటమే కాకుండా శత్రు పక్షంలో చేరి స్వాతంత్ర్య పోరాటాన్నే బలహీన పరచే ప్రమాదంకూడా వుంది. కాంగ్రెసు నాయకత్వం యీ సత్యాన్ని గుర్తించే తన ఆదర్శం సోషలిజమని స్పష్టంగా తీర్మానించలేదు. ఈ అదనుని తమ స్వార్థానికి ఉపయోగించుకుని కాంగ్రెసు సంస్థనే విప్లవాత్మకమైనపంథా అవలంబించకుండానిరోధించే వర్గాలుకూడా లేకపోలేదు. ఈ రెండు ప్రమాదాలనుండీ కాంగ్రెసుని తప్పించటానికి సరిఅయిన వామకక్షి కాంగ్రెసులో వుండి తీరుతుంది. 1934 వరకు కొందరు వ్యక్తులూ, తరవాత కాంగ్రెసు సోషలిస్టుపార్టీవారూ యీ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నారు.

కాంగ్రెసు చరిత్రను జాగ్రత్తగా పరిశీలిస్తే కాంగ్రెసుసంస్థ విప్లవాత్మకంగా మారుతున్నకొద్దీ కొందరు వ్యక్తులూ, కొన్ని వర్గాలూ కాంగ్రెసును విడనాడుతూవచ్చాయని తెలుస్తుంది. అతివాదమనే పేరుతో, ప్రస్తుతం ప్రయోజనకరంగాని కార్యక్రమాన్ని ప్రోత్సహించేవారు కొందరూ, సంయుక్త ప్రతిఘటన అనే నినాదం చాటున; కాంగ్రెసును విప్లవాత్మకసంస్థగా మారకుండా చెయ్యజూచేవారు కొందరూ దేశంలో కనిపిస్తున్నారు. కాంగ్రెసు యొక్క జాతీయనాయకత్వాన్ని అంగీకరిస్తూ కార్మిక కర్షకవర్గాన్ని స్వాతంత్ర్య సంపాదనానంతరం రావాల్సిన ఆర్థికవిప్లవానికి తయారు చెయ్యటం యిప్పటినుంచీ అవసరం.

"వలసదేశాల్లోని బూర్జువా స్వాతంత్ర్యోద్యమాల్ని కమ్యూనిస్టులమైన మనం బలపరచితీరాలి. బలపరుస్తాం" అన్నాడు లెనిన్.[1]

---

1. Left wing Communism.

సామ్రాజ్యవాద దౌర్జన్యాన్ని ప్రతిఘటించే ప్రతిఉద్యమాన్ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ బలపరుస్తుంది. సంయుక్త ప్రతిఘటనా విధానం అవలంబించాలి...

కమ్యూనిస్టులీగుకి ఉపన్యసిస్తూ 1850 లో మార్క్స్ "యీ పెట్టీ బూర్జువాలు ప్రజాస్వామికంకోసం పోరాడినంత కాలం మనం వారితో కలిసి పనిచెయ్యాలి. కాని విజయం పొందిన తక్షణం, దెబ్బలుతిన్న పాతశత్రువుమీద కాక, యింతవరకు కలిసిపోరాడిన పాతమిత్రుడిమీద (పెట్టీ బూర్జువా) కత్తికట్టాలి"; "కొందరు అభివృద్ధినిరోధకులు కేంద్రప్రభుత్వాన్ని వమ్ముచెయ్యటానికి ప్రయత్నిస్తారు. మున్సిపాలిటీలికీ, రాష్ట్రాలికీ సాధ్యమైనన్ని ఎక్కువ అధికారాలియ్యాలంటూ కార్మికులు దీన్ని తీవ్రంగా ఎదుర్కొని సాధ్యమైనంత ఎక్కువ అధికారం కేంద్రప్రభుత్వానికి సంక్రమించేటట్లుచూడాలి. స్వయంనిర్ణయంలాంటి పిచ్చిసూత్రానికి మోసపోరాదు" అని చెప్పాడు.

కాని భారత కమ్యూనిస్టులు ప్రజాస్వామికంకోసం జరిగిన ఏ పోరాటంలోనూ కలిసి పనిచెయ్యకపోవటమే కాకుండా పోరాడిన వర్గాలమీదే కత్తికట్టారు ప్రజాస్వామికం సిద్ధించకముందే. అదీగాక 'స్వయంనిర్ణయం' అనే పిచ్చిసూత్రానికి మోసపోయి కేంద్రప్రభుత్వాన్ని బలహీనపరచటానికి 'అభివృద్ధి నిరోధకుల'తో చేతులు కలిపారు.

"పాక్షిక, స్థానిక ప్రయోజనాల్ని, బహుళ శాశ్వత ప్రయోజనాలికి లోబరచాలి." "సోవియట్ రష్యా అంతర్జాతీయ కార్మికులికి పితృభూమికనక దాన్ని శత్రువులబారినుండి రక్షించే బాధ్యత ప్రతి శ్రామికుడిమీదావుంది" అనే నినాదాల్ని లేవదీసి అంతర్జాతీయత అనే పేరుతో రష్యా తన విదేశాంగనీతిని చలామణి

చేసుకుంటున్నా కూడా గమనించకుండా భారత కమ్యూనిస్టులు ప్రవర్తించడంచేత భారతప్రజానీకానికి దూరమైపోయారు. దేవుడినీ, మతాన్నీ తమ స్వార్థానికి ఉపయోగించుకున్న దేశాలు చాలా వున్నాయి. కాని అంతర్జాతీయత అనే నినాదాన్ని తమ స్వార్థానికి ఉపయోగించుకున్న ఏకైక దేశం ఒక్క రష్యాయే. ప్రపంచంలో ఎక్కడైనాసరే సోవియటు వ్యతిరేకతా, దేశభక్తీ యీ రెండూ పరస్పర విరుద్ధమని వాళ్ల ఉద్దేశం. నెహ్రూ చెప్పినట్లు భారత కమ్యూనిస్టులు తమ విద్రోహప్రవర్తనవల్ల అసలు కమ్యూనిజానికే అప్రతిష్ఠ తెచ్చి, ప్రజలా పేరునే అసహ్యించుకునేట్టు చేశారు. అందువల్ల సరియైన అతివాదుల స్థితి మరింత క్లిష్టమైపోయింది.

తప్పు చెయ్యటం సహజమే. కాని చేసినతప్పును ఒప్పుకోటంలోనే గొప్పతనం వుంది. "మనతప్పుల్ని బహిరంగంగా ఒప్పుకోటం, మన శత్రువులు మనని బలహీనులుగా తలిచే అవకాశం కలిగిస్తుంది. కనక అలా మన తప్పుల్ని మనం బహిరంగంగా ఒప్పుకోరాదని కొందరు కామ్రేడ్సు అంటున్నారు. ఇది చెత్త, పక్కాచెత్త. బహిరంగంగా మనతప్పుల్ని ఒప్పుకుని సవరించుకోటంవల్ల మనపార్టీ బలపడుతుంది. కూలీలయొక్కయు రైతులయొక్కయు పనిచేసే విద్యాధికులయొక్కయు దృష్టిలో అధికారాన్ని ఇనుమడింప చేస్తుంది. ప్రభుత్వశక్తిని హెచ్చిస్తుంది" అన్నాడు స్టాలిన్[1] — కాని భారత కమ్యూనిస్టులు అలా చేస్తేగా!

ఆధునికులు "పూర్ణస్వరాజ్యం, సత్యాగ్రహం, రామరాజ్యం, హర్తాళం, గ్రామపరిశ్రమలు" లాంటి శబ్దాలు మధ్యయుగపు వాతావరణాన్ని కల్పిస్తాయని విమర్శిస్తారు. వాటిబదులు 'కంప్లీట్ ఇండిపెండెన్సు' 'నాన్ కోఆపరేషన్' 'డెమాక్రటిక్ గవర్నమెంట్' 'జనరల్ స్ట్రయిక్' 'డీసెంట్రలైజేషన్ ఆఫ్

---

1. P. 19. On Organization.

యింపెక్ట్రిస్ట్' అన్న శబ్దాలు వాడితే అతనికి నచ్చుతాయి.[1] నిజానికి అతనికే శబ్దాలు నచ్చుతాయా అనేది కాదు విచారించవలసినది. భారతప్రజానీకం ఏశబ్దాల్ని హర్షిస్తుందో తెలుసుకోవాలి. నిస్సందేహంగా మొదటిపరస శబ్దాలే భారతప్రజా హృదయానికి దగ్గరని చెప్పాలి. "రష్యాసోషలిజం, కమ్యూనిజం, బహిరంగంగా రాజనీతి కావాలంటే బాగానేవుంటుంది. కాని గాంధిజీ 'రాజకీయాల్లోకూడా సత్యం కావా'లంటే 'అబ్బే అసంభవ'మంటారు" అని విమర్శిస్తున్నాడు కృపాలినీ. మాటలపట్టింపుకీ స్వకీయప్రతిష్ఠకీ లోనై ప్రజానీకాన్ని దూరం చేసుకోటం వివేకం కాదు.



1. 'Ganhian Way'

# గాంధిజం : సోషలిజం



## మూడో భాగం

## కొన్ని అపోహాలు

సోషలిజం అంటే స్త్రీల విషయమై ఉన్నన్ని అపోహాలు యింకో విషయమై లేవు. ఆంతర్యంలో సోషలిజం అంటే వుండే అయిష్టతని వెలిబుచ్చే గుండె ధైర్యం లేక 'సోషలిజంలో స్త్రీ సంఘ పరం అవుతుంది. కనక సోషలిజం అంటే అవినీతి' అని ప్రచారం చేసేవాళ్లు కొందరున్నారు. కమ్యూనిజంలో స్త్రీలకి లభించే స్వాతంత్ర్యాన్ని తప్పుడుగా అర్థంచేసుకుని అవినీతిగా వర్తిం స్తూ 'మేము అతివాదులం' అని చెప్పుకునేవారు పై అభిప్రాయాలికి అవకాశం కల్పించారు. అలాంటివాళ్లు కమ్యూనిజానికి చేస్తున్న ద్రోహం అమితం.

"దాహమైనప్పుడు ఓగ్లాసెడు నీళ్లు తాగినట్టే కామంకూడా తక్కిన ప్రవృత్తులలాగా సామాన్యమైనదే. దానికేమీ ప్రత్యేక ప్రాముఖ్యంలేదు" అంటూ ప్రచారంచేసే ఓ ముఠా బయలుదేరే సరికి లెనిన్ వాళ్లకిలా బుద్ధిచెప్పాడు : "సాధారణ మానవుడు సాధారణ పరిస్థితులలో, మట్టిలో దొర్లుతూ, మురికిగుంటలో నీళ్లు తాగుతాడా ? ఎవరైనా, పదిమంది కరుచుకు తాగటంవల్ల జిడ్డు కారే గ్లాసుతో నీళ్లు తాగుతారా ?"

స్త్రీపురుష సంబంధంఅంటే "ముద్దుపెట్టుకోటం, ఎవరి దారినవాళ్లు పోవటం" అనేంత పలచనచేసే భావానికి వ్యతిరేకించినవాడు లెనిన్.[1] వ్యక్తియొక్క నైతిక జీవితానికి గాంధీజీ యిస్తున్నంత ప్రాముఖ్యం సోషలిజం యివ్వనిమాట నిజం. అంత మాత్రంచేత స్వేచ్ఛావిహారానికి సోషలిజం లైసెన్సు యిస్తుందని అనుకోటం కూడా ఆత్మవంచనమే అవుతుంది. అలా భావించే సోషలిస్టులూ, సోషలిస్టులు కానివాళ్ళూకూడా సోషలిజానికి సమానంగానే హాని చేసినవాళ్లవుతారు.

ఆయా దేశకాలాల్నిబట్టి ప్రవర్తనయొక్క నైతికమూల్యాలు మారుతూ వుంటాయి. మనిషియొక్క సహజ వాంఛల్ని సాధ్యమైనంత వరకు, యితరులికీ, ఆమనిషికీకూడా హానిలేకుండావుండే విధంగా, నెరవేర్చుకునేందుకు ఏర్పడ్డ నియమాలే నైతికనిబంధనలు. ఆనిబంధనలు తీవ్రమై బంధనాలుగా మారితే వాటిని తెంచేస్తాడు మానవుడు. ఆనిబంధనలు లేనేలేనంత లేలికయితే విశృంఖల విహారంచేస్తాడు. గాలిలేకపోతే దీపంవెలగదు. ఆ గాలే మరీతీవ్రమైనా, లేనేలేనంత తక్కువయినా దీపం ఆరిపోతుంది. మనిషికి కట్టుబాట్లు, దీపానికి గాలివంటివి. వైవాహిక నిబంధనలూ అలాంటివే.

సోషలిజంలో స్త్రీ సంఘపరంచెయ్యబడుతుందనే విమర్శనని తీవ్రంగా ఎదుర్కొంటూ మార్క్స్ యిలారాశాడు. "కమ్యూనిస్టులు స్త్రీలని సంఘపరంచెయ్యాల్సిన అవసరం ప్రత్యేకం ఏమీలేదు...బూర్జువా వివాహపద్ధతి నిజానికి ఉమ్మడి భార్యల విధానమే[2] ఒకే వ్యక్తి దగ్గర చాలాధనం కేంద్రీకృతం అవటంచేత

---

**1. P. 5. 'Children in U. S. S. R.' By Shanta Kiernan.**

2. కమ్యూనిస్టు మానిఫెస్టో.

ఏకభర్తృత్వం తలెత్తింది. అందువల్లనే ఏకపత్నీత్వం అవసరమని
పించలేదు. ఆ ఏక భర్తృత్వం, దానికి కారణమైన ఆర్థిక వ్యవస్థ
పోగానే, దానితో పాటు పోతుంది. నిజానికి సోషలిస్టు ప్రభు
త్వంలో ఏకభర్తృత్వం నశించదు. పైగా ఏకపత్నీత్వం సిద్ధిస్తుంది
కూడాను. పూర్వకాలపు సంఘంలో సరైన స్త్రీ పురుష ప్రేమ
అనాగరిక జాతుల్లో మాత్రం కనిపిస్తుంది. నగరాల్లోని స్వతంత్ర
స్త్రీ పురుష ప్రేమ వ్యవహారాలు వ్యభిచారం ద్వారామాత్రమే
వృద్ధి పొందేవి. అధికారవర్గాల్లో, వ్యక్తుల పరస్పరసంబంధంకంటే,
ఆర్థిక సాంఘిక హోదాలే ప్రేమ వ్యవహారాల్లోకూడా ప్రధాన
పాత్ర వహించేవి. ...ప్రేమ మీద ఆధారపడిన వివాహమే
నీతివంతమయితే ఆప్రేమ ఉన్నంతకాలమే వివాహం నీతివంత
మవుతుంది.[1]

సోషలిజాన్ని గురించి అధికారయుక్తంగా మాట్లాడే అర్హత
గలవాళ్లు పై విధంగా చెప్పినా, సోషలిజాన్ని కొన్నాళ్లుగా అమ
లులో పెట్టిన రష్యాలో పరిస్థితి అంతఆకర్షణీయంగా లేదనే చెప్పా
ల్సొస్తుంది. వాస్తవస్థితిని గుర్తిస్తే రష్యాకి అనుకూలురూ ప్రతి-
కూలురూ గోరంతలు కొండంతలుచేసి చెప్పే విషయాల నిజా
నిజాలు బయటపడతాయి. 'రష్యాలో స్త్రీలు వివాహం చేసు
కుంటానికిగాని మానటానికిగాని స్వతంత్రులు. ఆమె తన కిష్టం
వచ్చినంత మంది పిల్లల్ని కనవచ్చు. విడాకులిచ్చే స్వాతంత్ర్యం
స్త్రీకివుంది. కాని ఆలా విడాకులివ్వడం తీవ్రంగా నిరుత్సాహ
పరచబడుతోంది. ఎక్కువమంది పిల్లల్ని కన్నతల్లులికి 2000 నుంచి
5000 లరూబుల్సువరకు గ్రాంటులు యివ్వబడుతున్నాయి......
స్త్రీని ఆర్థికంగా పురుషుడిమీద ఆధారపడేటట్లుచేసి ఆమె జీవి
తాన్ని కష్టతరంగా మార్చే పూర్వకాలపు గృహజీవితాన్ని సోవి

1. **Engels in "*O*rigin and development of Family etc."**

యట్ యూనియన్ ముక్కలుముక్కలు చేసింది. దానికెవర్నూ దూషించక్కర్లేదు. రష్యాలో గృహజీవితం ఛిన్నాభిన్న మవటం అంటే, నైతికంగా అవిశ్వాసం అనికాని, కట్టుబాటులేని జీవితం అనికాని అర్థంచేసుకోరాదు.[1]

వివాహంకంటే విడాకులు పొందటం తేలిక. స్త్రీగాని పురుషుడుగాని మేజస్ట్రేటు ఎదటికి వెళ్ళి విడాకులు కావాలనే కోరికను, వెలిబుచ్చితేచాలు, విడాకులు పొందవచ్చు. పిల్లలుంటే వారి పోషణకి కొంత భృతి యివ్వాలని నిర్ణయింపబడుతుంది. ఈ భృతినిర్ణయంలో అప్పీలు చేసుకుంటానికి అవకాశంవుంది. కాని విడాకుల విషయంలో అప్పీలు కవకాశంలేదు......'నా భార్య'అంటే 'సాధారణంగా ఎడతెగకుండా అలవాటుగా నాతో కూడాకలిసి నివసిస్తున్న స్త్రీ' అని అర్థం...... కాని సాధారణంగా స్త్రీపురుషుల యీ ప్రేమబంధం తెగదని గుర్తించుకోవాలి......' 'మాస్కోలో పశుప్రవృత్తి లేనేలేదనటం అతిశయోక్తి. కాని సామ్రాజ్యాలలోని పట్టణాల్లోకంటే మాస్కోలో పశుప్రవృత్తి తక్కువ' అని అనటం సమంజసం అవుతుంది.[2] వివాహబంధంలేని స్త్రీ పురుష సంబంధం యితరదేశాల్లో అవినీతిగాను కళంకంగాను పరిగణింపబడుతుంది. కాని రష్యాలో అలా కాదు. అయినా అక్కడ అవినీతి సామ్రాజ్యం వెలుస్తోందని అనటానికి యేలాంటి అవకాశమూలేదు.[3] తలిదండ్రులు అకారణంగా సంతానాన్ని వదిలిపెడితే వారిదగ్గర్నుంచి సంతానంయొక్క పోషణకోసం వారి సంపాదనలోనుండి 50% వరకు యివ్వవలసిందిగా నిర్బంధించవచ్చు. అసంతానం చట్టబద్ధంగా

1. Socialist Sixth of the World P. 96. 2. Life under the Soviets P P, 153, 154

3. గాంధీవాద్ ఔర్ సమాజవాద్. పే 113

రిజస్టరు చెయ్యబడిన సంబంధంవల్ల పుట్టిందా లేదా అని విచారించనక్కర్లేదు.[1]

“కుటుంబంలోని స్త్రీ పురుషులిద్దరూ ఏపనిలోనో పోతుం భోజనాలు ఏ ‘కమ్యూన్’ లోనో చేస్తూ పిల్లల్ని ‘క్రెచ్’ లోనో ‘నర్సరీ’లోనో ‘కిండర్ గార్టెన్’ లోనో అప్పగించేస్తారు. జబ్బు చేస్తే ఆసుపత్రులున్నాయి. పాలు తాగే పిల్లలయితే నియమిత సమయాల్లో తల్లి వెళ్లి పాలిస్తుంది. చూడాలని వుంటే తండ్రి కూడా విశ్రాంతి సమయంలో చూసి ఒస్తాడు—ఇందువల్ల పిల్లలు తలిదండ్రుల ప్రేమనీ లాలననీ కోల్పోతారు. పిల్లా జెల్లలతో కూడి వుండే కుటుంబజీవనసౌఖ్యం తలిదండ్రులికి కరవై పోతుంది. క్రమంగా మనుష్యుల్లో యాంత్రికత పెరిగి పోతుంది సోషలిస్టు సమాజంలో” అని మరో ఆపోహ ప్రబలింది.

పైరకం జీవితం రష్యాలో కనిపించినా కొంతవరకు ఆలక్షణాలు పెట్టుబడిదారీ సమాజంలోకూడా లేకపోలేదు. భార్యాభర్తలిద్దరూ పనిలోకెళ్లటం, ‘నర్సరీ’ లోనో ‘కాన్వెంటు’ లోనో పిల్లల్ని అప్పచెప్పడం, యింట్లో వంటలేకుండా ఏహోటలులోనో భోజనాలు చెయ్యడం యితర పాశ్చాత్య దేశాల్లోకూడా జరుగుతునే వుంది. కనక దీని లాభనష్టాలు ప్రత్యేకం సోషలిజానికే ఆపాదించనక్కర్లేదు. అదీ కాక వివాహంలేక స్త్రీ పురుషసంబధమైన ప్రశ్నలికీ సోషలిస్టు అవటానికీ ఏంసంబంధంవుంది? విశాలార్థంలో సోషలిజంయావత్తు జీవితానికి సంబంధించిన ఓతత్వశాస్త్రమే అయినా సాధారణంగా ‘ ఆర్థిక సంబంధమైన ఓ విశిష్టసిద్ధాంతంగానే సోషలిజం అర్థం చేసుకోబడుతోంది. కనక సోషలిజాన్ని గురించి విచారించేటప్పుడు మతం, వివాహం, నీతి—వీటినిగురించి

---

1, Children in U. S. *S*. R. *P*. 5.

చర్చించడం కేవలం అసంగతం ' అని జవహర్లాల్ నెహ్రూ కుమారి ప్రేమ బహన్ కంటక్ కి రాసిన ఉత్తరంలో వుంది.[1]

వివాహం ఒక కంట్రాక్టు మాత్రమేనని పాశ్చాత్యుల ఉద్దేశం. ఇతర దేశాలలో వైవాహిక జీవితం సుఖమయం చెయ్యటానికి గావించిన అనేక ప్రయోగాల్లో రష్యా ప్రయోగం ఒకటి. దాంట్లో కొన్ని లోపాలున్నాయి. సందేహంలేదు. కొంత కాలానికి వారు దాన్ని మార్చుకోవచ్చు. మన దేశంలోని వైవాహిక జీవితంలో కూడా కొన్ని మార్పులు చేసితీరాలి. పురుషునికి లేని చట్టసంబంధమైన అసౌకర్యాలేవీ స్త్రీకి ఉండరాదు.[2] "స్వతంత్ర భారతదేశంలో సందర్భాల్ని బహుజాగ్రత్తగా విచారించినమీదటనే విడాకులకి వీలగునట్లు చేయబడుతుంది" అంటున్నారు డాక్టరు పట్టాభిగారు.[3] ఈ మార్పులు చేసేటప్పుడు యితర దేశాల్లో జరిగిన, జరుగుతున్న ప్రయోగాల్ని పరిశీలించాలి తప్పకుండా. అలాగే రష్యా ప్రయోగాన్ని విచారించవచ్చు. అంతేగాని సోషలిజానికీ రష్యాలోని పై స్త్రీ-పురుష జీవితసంబంధమైన విషయాలకీ ఏమీ అవినాభావసంబంధం లేదు. కనక పై కారణాల్ని పురస్కరించుకుని సోషలిజాన్ని నిందించడం క్షంతవ్యం కాదు.

"పేదవాళ్ల పేదరికాన్ని కష్టాల్ని యింకా యింకా హెచ్చు చేస్తే వాళ్లల్లో విప్లవాగ్ని రేగుతుంది. కాస్త కాస్త మేలుచేకూర్చే గ్రామపరిశ్రమల్లాంటి సంస్కరణలు ఆ విప్లవాగ్నిని చల్లారుస్తాయి. కనక ఖద్దరులాంటి గృహపరిశ్రమల్ని ప్రోత్సహించరాదు" అనే అపోహతో కొందరు అవివేకులు వాదించడం చూస్తున్నాం. అది నాయకుల కార్యక్రమంలో యీ విధానం ఎక్కడా చెప్పబడలేదు.

---

1. Bombay Chronicle D/ 7-10-36 quoted in Gandhism: Socialism 2, Mind of Mahatma Gandhi P,112. 3. Gandhi & Gandhism P. 480.

"మేము కోరేది సంస్కరణ కాదు విప్లవం" అనే నినాదానికి విపరీత వ్యాఖ్యానం చెయ్యడంవల్ల పైవాదం పుట్టిందేమోననిపిస్తోంది.

'పై వాదం పయారహితమే కాకుండా బేసబబుగాకూడా వుంది.'[1] పీడవాళ్లస్థితిగతులు బాగుపడుతున్నకొద్దీ, కొంతవరకు దానిఫలితంగానే, విప్లవాలు ఒచ్చిన సందర్భాలు చరిత్రలోవున్నాయి. పూర్వకాలంలో రోముదేశపు బానిసలూ, అమెరికాలోని నీగ్రోలూ, భారతదేశంలోని హరిజనులూ బహునికృష్టదశలో వున్నా, విప్లవం తేలేకపోయారు. రష్యాలోవున్న ఆర్థికదుస్థితే, ఆస్ట్రియా, జర్మనీ, హంగేరీదేశాల్లోకూడా వున్నా ఆదేశాల్లో విప్లవం రాలేదు.[2] కనక విప్లవానికి యితర కారణాలు చాలా తోడ్పడాలి. పీడితవర్గాలు తమ దుస్థితిని తెలుసుకోలేని అజ్ఞానంలో వున్నా, తెలుసుకున్నప్పటికీ, పైకిరాగలమనే ఆశలేకపోయినా, ఆశవున్నా, నడిపించే సరైన నాయకత్వం లేకపోయినా, సరైన నాయకత్వంవున్నా యితర పరిస్థితులు అనుకూలించకపోయినా విప్లవంరాదు. ఒచ్చినా గెలవదు. గెలిచినా ప్రతివిప్లవం తప్పదు.

క్షుధార్తుల ఆకలిమంటల్ని వృద్ధిచేస్తే విప్లవం ఒస్తుందనే [illegible]నినాదమే సరైనదయితే దీన్ని వర్తింపచెయ్యాల్సింది చైతన్యవంతమయిన మధ్యతరగతి ప్రజలకిగాని, ఏమాత్రం చైతన్యంలేని కార్మిక కర్షకులికికాదు. చిన్న చిన్న దుకాణదార్లకొట్లు పికెటింగు చెయ్యాలి. చిన్నచిన్న వుద్యోగస్తుల ఉద్యోగాలు ఊడగొట్టించాలి. విద్యార్థికుల్లో నిరుద్యోగం హెచ్చేటట్లు చెయ్యాలి. డాక్టర్లకీ, ప్లీడర్లకీ ప్రాక్టీసురాకుండా చెయ్యాలి.'

1. Gandhi & Gandhism P, 292
2. Gandhian Way P, 22

కాని పై కార్యక్రమం సాగించాలని ఏ అతివాదీ చెప్పడు. తమ విప్లవతత్వాన్ని ప్రదర్శిద్దామనే వెర్రి ఆవేశంతో కుడిపక్ష నాయకత్వాన్నీ కార్యక్రమాన్నీ విమర్శించటానికి అనాలోచితంగా పూనుకోటంవల్ల కొందరు చెప్పే మాటలేగాని, వాస్తవానికి ట్రేడ్ యూనియనులూ, కార్మిక కర్షక సంస్థలూ పెట్టి అతివాదులు చేసే పని అంతా సంస్కరణవిధానమే. కార్మికుల జీతాల హెచ్చింపుకీ, శెలవులూ, ప్రావిడెంటుఫండులూ, నివాసగృహాలూ మొదలయిన సౌకర్యాల్ని కలిగించటానికీ సమ్మెలు చేయిస్తారు. అప్పుడు పెట్టుబడిదార్లు విదేశ సామ్రాజ్యవాద ప్రభుత్వంయొక్క పోలీసు మిలిటరీసాయంతో కార్మికుల్ని హింసిస్తారు. కనక పరప్రభుత్వాన్ని పారదోలే పోరాటంలో తాముకూడా కలవాల్సిన అవసరాన్ని కార్మికుడు ప్రత్యక్షంగా గుర్తిస్తాడు. ఈ విధంగా కార్మికులలో చైతన్యం కలగజేసి స్వాతంత్ర్య పోరాటంలోనూ, తదనంతరం ఆర్థిక విప్లవంలోనూ కార్మికవర్గాన్ని వీరోచితంగా పాల్గొనచెయ్యడం వీరి పరమావధి. జీతాల్ని హెచ్చింపజేసి కార్మికుల కష్టాల్ని కొద్దికొద్దిగా తొలిగించడం వారిలోవుండే విప్లవాగ్నిమీద నీళ్ళు చల్లడమే అయితే పైపంథా తప్పుడుపంథా అవాలి.

కొద్ది లక్షలమంది మాత్రమేగల ఫ్యాక్టరీకూలీలకోసమే యింతింత ప్రయత్నాలు చేస్తుంటే, కోట్లతరబడిగావున్న కర్షకుల్ని స్వాతంత్ర్యపోరాటంలోకి తీసుకురావటానికి అతివాదులేం కార్యక్రమం చూపిస్తున్నారు ? మనదేశంలో సాధారణంగా రైతుకి వ్యవసాయపు ఖర్చులే మళ్ళటంలేదు. సంవత్సరంలో ఆరు నెలలు పనిలేదు. ఆ కాలంలో ఉపవృత్తిగా ఉపకరించే గృహపరిశ్రమలు నశించిపోయాయి. వాటికి ప్రోత్సాహమివ్వడం రైతుల కైనందిన కష్టాల్ని నివారించటానికి కృషిచెయ్యడమవుతుంది. తద్వారా వాళ్ల సానుభూతిని సంపాదించుకుని క్రమంగా వాళ్లలో చైతన్యం కలగజేసి వాళ్లని స్వాతంత్ర్యపోరాటంలోకి తీసుకు

రావాలి. ఈ ప్రయోజనం సిద్ధించటానికి అతివాదులు ఖద్దరులాంటి గృహపరిశ్రమల్ని ప్రోత్సహించాలి.

ఇంకో అపోహాయిది: "కాంగ్రెసు జాతీయసంస్థ. దేశం లోని అన్ని వర్గాలూ దాంట్లోజేరి స్వాతంత్ర్యంకోసం పోట్లా డాలి. స్వరాజ్యంరాగానే అన్ని కష్టాలూ పోతాయి. దేశ భక్తివల్ల ఉత్తేజనం పొంది కార్మిక కర్షకుల్లో వారంతా తమం తట తామే కాంగ్రెసులోకొచ్చేస్తారు. కనుక ప్రత్యేకవర్గసంస్థలు అనవసరం." దాదాపుగా కుడిపక్ష నాయకులు తా పై విధంగానే తలచడంచేత నిన్న మొన్నటివరకు కార్మిక, కర్షక, విద్యార్థి, యువ జనుల్ని సంఘటితపరచటానికి ప్రత్యేకంగా ఎవరూ సరైనకృషి చెయ్యలేదు. ఇప్పటికైనా నిర్మాణ కార్యక్రమంలో రైతు, కూలి, విద్యార్థి, ఆదిమ నివాసుల్ని సంఘటితపరచాలనే అంశాల్ని జేర్చడం ముదావహం. ఈవిషయమై చెయ్యాల్సినపని యింకా ఎంతో వుంది.

సాధారణంగా అమాయకుడైన రైతు కాంగ్రెసులో జేరి కష్టపడుతూవుండే మధ్యతరగతి వారిని పొగడుతూ "మీరు చదువు కున్నవాళ్లు. గొప్పవాళ్లు. దేశానికి మేలుచేస్తున్నారు. మేమేం చెయ్యగలం బాబూ? చదువూ సంధ్యాలేదు. అన్నంలేదు" అంటూ దేశసేవ అనేదానికీ తనకీ ఎంతో దూరం వుందనీ అల్పు డైన తాను అంతగొప్పపని చెయ్యలేననీ భావిస్తాడు. స్వరాజ్య పోరాటంలో చాలా వెనకపడి పిరికితనంచూపించే రైతు, కూలీ, తమజీవితసమస్యల్లో,ప్రాణంఒడ్డికూడావీరోచితంగాపోట్లాడుతాడు. ఉదాహరణగా, రచయితకి ప్రత్యక్షసంబంధంగల పెదకళ్లేపల్లి అనే గ్రామంలోని ఒక సంఘటనని తీసుకోవచ్చు. గత పాతిక శతాబ్దంనుండీ ఆగ్రామంలో కాంగ్రెసు సంఘంవున్నా, మధ్యతర గతి ప్రజలు దేశభక్తి ప్రబోధితులై పనిచేస్తూ వచ్చారు. తప్పితే, రైతు కూలీలూ ఎలాంటి ఉత్సాహం చూపేవాళ్లుకారు. కాని ఆమధ్య చల్లపల్లి జమీందారుగారు రైతుల భూమిని వశపరచు

కుని దున్నిస్తుంటే, కాంగ్రెసు వాదులు రైతులికి శాస్త్ర ప్రబోధం చేసేసరికి గ్రామంలోని యావన్మందీ, స్త్రీలుసహా జయనాదాలు చేసుకుంటూ వచ్చి సత్యాగ్రహంచేశారు బ్రహ్మాండంగా.

విద్యార్థిలో కొన్ని కూడా కుడిపక్షనాయకులు నిర్లక్ష్యంచేసేసరికి వాళ్లు అభివృద్ధినిరోధకులచేతుల్లోపడ్డారు. కాని విద్యావంతులవటంచేత 1942 జాతీయవిప్లవంలో అభివృద్ధినిరోధకుల రంగు బైటపడినప్పుడు వారి వలలోంచి తప్పుకోగలిగారు. పురోగామి పంథాలో విద్యార్థి కాంగ్రెసు నడుస్తోంది యిప్పుడు. విద్యాగంధం లేని కార్మిక కర్షకవర్గాలు పాపం అభివృద్ధినిరోధకుల ఇనుప పిడికిలిలోంచి బయటపడటానికి ఎంతో కష్టమైపోయింది. కార్మికు లిప్పటికీ సంపూర్ణంగా బైటపడనేలేదు.

'అతివాదులు నిర్మాణాత్మకంగా ఏమీ చెయ్యలే'రనీ 'ఆర్గనైజేషన్' అంటూ పూరికే కబుర్లుమటుకు చెబుతారనీ నిందించడం వింటున్నాం. "ప్రతిఘటనోద్యమం సాగించే శక్తిలేక నిర్మాణ కార్యక్రమం అంటూ కాలక్షేపం చేస్తా" రని కుడిపక్షంవారిని అతివాదులు విమర్శించడం కూడా కద్దు. కొందరు వ్యక్తులు తమ అశక్తతనీ, పిరికితనాన్ని 'ఆర్గనైజేషన్' చాటునా 'నిర్మాణ కార్యక్రమం' చాటునా దాచుకుంటూ వుండడం అబద్ధం కాకపోయినా అందరినీ పై విమర్శనలికి గురిచెయ్యడంలో అర్థంలేదు. నిర్మాణాత్మకంగా కొంతపని చెయ్యటానికి 'ఆర్గనైజేషను' చాలా అవసరమే. నిజానికి 'ఆర్గనైజేషను' కూడా ఒకవిధంగా నిర్మాణ కార్యక్రమమే.

"రాటం ఒడికితేచాలు స్వరాజ్యంవస్తుంది" అని గాంధీజీ చెప్పాడని మరో అపోహవుంది. ఈ అపోహతోనే కొందరు "రాటం ఒడికితే స్వరాజ్యం ఒస్తుందా? దంపుడు బియ్యం తింటేనూ, చేతికాగితాలమీద ఉత్తరాలురాస్తేనూ మాలవాళ్లని గుళ్లల్లోకి తీసుకెడితేనూ, హిందీ నేర్చుకుంటేనూ, విధవావివాహాలుచేస్తేనూ స్వరాజ్యం ఒస్తుందా? ఇవన్నీ సంఘ సంస్కర్తలు

చేసే పనులు. రాజకీయ నాయకులు రాజకీయ కార్యక్రమం యిచ్చి ప్రజల్ని పోరాటానికి సిద్ధంచెయ్యాలి. ఈ సంఘసంస్కరణ కార్య క్రమాలు ప్రజల దృష్టిని ప్రధానసమస్యలమీద నుండి అప్రధాన సమస్యలమీదికి మళ్లిస్తాయి." అంటూ గాంధీజీని విమర్శిస్తున్నారు. ఈ విమర్శనని సహించలేక గాంధేయులు "గాంధీజీని విమర్శించే యీ పెద్దమనుష్యులు తామే ఒక పోరాటాన్ని ఎందుకు మొదలెట్ట రాదు?" అని ప్రశ్నిస్తారు. సరైన మరో కార్యక్రమం సూచించ కుండా వున్న కార్యక్రమాన్ని విమర్శించడం నిర్మాణాత్మకం కాకపోయినా, "చేతనయితే నువ్వేనడుపు వేరే ఉద్యమం. లేక పోతే చచ్చినట్టు నేను చెప్పిన కార్యక్రమం ప్రకారంనడు" అనడంకూడా భావ్యం కాదు. విమర్శనని స్వీకరించడంలో మహాత్మునికున్నంత సహృదయత మరొకరికి లేదు.

ఏళ్ల తరబడిగా సాగే స్వాతంత్ర్య పోరాటంలో మొదటి నుంచీ చివరిదాకా ప్రత్యక్షపోరాటం తీవ్రంగా నడపటం అసంభ వం. ఒక పోరాటం లేవటానికి కొంత కాలం తయారీచెయ్యాలి. ఆపోరాటం అయింతర్వాత తమ శక్తుల్నికూడ తీసుకుంటానికి మళ్లీ కొంత సావకాశంవుండాలి. ఇది తప్పదు. కాని ఎప్పుడూ కూడా ప్రజానీకంతో సంబంధంమాత్రం.పోకుండాయూ ప్రజా సేవ కులికి పని కల్పించేటట్లూన్నూ ఉండాలంటే ఒక విశిష్ట కార్య క్రమం తప్పదు. ఆ కార్యక్రమమే నిర్మాణ కార్యక్రమం. ప్రత్యక్ష పోరాటంలోకి ప్రజానీకాన్ని తీసుకురావటానికిగాను, వారిదైనందిన కష్టాల్ని నివారించేందుకూ, పోరాటం అయింతర్వాత వర్కర్లకి పని కల్పించటానికీ, అంటే రాబోయే పోరాటానికి ప్రజల్ని తయారుచెయ్యటానికీ యీ నిర్మాణకార్యక్రమం ఎంతో తోడ్పడుతుంది.

"అంతా ఖద్దరుకట్టితే స్వరాజ్యం ఒస్తుంది" అని గాంధీజీ అనడం నిజమే. అదే ఏకైకసాధన అయితే, శాసనోల్లంఘనాలూ

సత్యాగ్రహాలూ ఎందుకు మొదలెట్టుతారు గాంధీగారు ? నిజానికి అంతా ఖద్దరుకట్టడమంటే ఆశయంయొక్క ఏకత్వాన్ని గుర్తించడం అన్నమాట. అది గుర్తించినవాడు ఎప్పటికో ఒకప్పుడు ఆ ఆశయసిద్ధికోసం ఏదోవిధంగా పనిచేసితీరే అవకాశంవుంది. అదీకాక ప్రజానీకాన్ని నడపటానికి ఒక ప్రతీకం సృష్టించడం అవసరం. ఆధునిక భారత రాజకీయాల్లో ఖద్దరులాంటి విపుల శక్తివంతమైన ప్రతీకం యింకోటిలేదు. గుడ్డకట్టనివారెవరూ వుండరు. కట్టిన ఆ గుడ్డ ఖద్దరైతే, తాను భారతస్వాతంత్ర్య సంపాదనకి ఉడతాభక్తిగా తోడ్పడుతున్నాననేభావం బట్టకట్టే ప్రతివాడికీ కలిగించడంటే ఎంతభావవిప్లవం ఒస్తుందో వూహించవచ్చు. ఆయాప్రయోజనాలమాట ఎలావున్నా నిత్యమూవాడే వస్తువులవిషయంలో, అందులోనూ ముఖ్యంగా అన్నవస్త్రాల విషయంలో ప్రజలికి సలహాయివ్వాల్సిన బాధ్యత ప్రజాసేవకులమీద వుండితీరుతుంది. "ఏది చౌకగా ఒస్తే అది కొనుక్కో" అని సలహా యివ్వడు ఏ ప్రజాసేవకుడూ. చౌకగా ఒస్తుందని విదేశీ సరుకుని ప్రోత్సహించడుకదా ఎంత అతివాదిఅయినా! స్వదేశీ మిల్లు వస్తువుల్ని ప్రోత్సహించడమంటే గృహపరిశ్రమలవల్ల జీవించే వారి పొట్టమీద కొట్టటమే కనక, ప్రస్తుత ఆర్థికవ్యవస్థ అలానే వున్నంతకాలం గృహపరిశ్రమల్నే ప్రోత్సహించాలని సలహాయిచ్చి తీరాలి. అయినాకూడా డబ్బులేనివాడు ఖద్దరు ఎలాగూ కొనడని కుంటిసాకు చెప్పటోటంలో అర్థంలేదు. స్వాతంత్ర్యంకోసం, సర్వస్వం బలిదానంచెయ్యాలని ప్రబోధిస్తాం. ఆ శక్తిలేనివాడు ఏమీ చెయ్యానే చెయ్యడు. అంతమాత్రంచేత ప్రబోధం చెయ్యడం మానుతామా ? దంపుడుబియ్యం, చేతికాగితంలాంటి విషయాల్లో కూడా పై సూత్రమే వర్తిస్తుంది. తినేతిండీ కట్టేబట్టా దగ్గిర్నుంచీ ప్రజాసామాన్యం ఉద్దేశపూర్వకంగా ప్రవర్తిస్తే ఎంతో చైతన్యం కలిగేదీ, మానవమనస్తత్వాన్ని ఏమాత్రం అర్థంచేసుకున్నా బోధపడుతుంది.

"ప్రపంచ కార్మికులారా ఏకముకండు. పోగొట్టుకోటానికి మీదగ్గిర బంధనాలు తప్ప మరేమీలేవు, అనే కమ్యూనిస్టు నినాదం హరిజనుల విషయంలో బాగా వర్తిస్తుంది" అన్నారు డాక్టరు పట్టాభిగారు.[1] హరిజనులు చాలావరకు కూలివర్గానికి చెందినవారు. కాని ఫ్యాక్టరీ కార్మికులలో పనిచేసే పద్ధతిని వీరిలో పనిచెయ్యడం వీలుగాదు. మరోవేపునుంచి బయలుదేరి గాంధిజీ వీరిలో చైతన్యం కలగజేశారు. 1932 రాజకీయపోరాటపు తీవ్రత తగ్గినరోజుల్లో ప్రజలలో ఒకవిధమైన నిస్పృహా, నిరాశా జనించి నప్పుడు, శతాబ్దాలతరబడి అధోగతిలో పడివున్న ఒకకార్మికవర్గాన్ని చైతన్యవంతంచేసే గొప్ప కార్యక్రమాన్ని తన ప్రత్యేక విశిష్టమైన విధానంలో మొదలెట్టి ప్రజాసామాన్యం మీద కాంగ్రెసుపలుకుబడిని రేమాత్రం సడలనీయకుండా చేయడంలో నిజంగా గాంధిజీయొక్క రాజకీయ చతురత స్పష్టంగా కనిపించింది.

కాని ఒక్కవిషయం మాత్రం చెప్పితీరాలి. గాంధిజీని విమర్శించేవారిలో వున్నట్టే గాంధేయులలో కూడా ఆయన అంతర్యాన్ని అర్థం చేసుకోలేనివాళ్లు లేకపోలేదు. అలాటివాళ్లు ప్రధానమైన రాజకీయ కార్యక్రమాన్ని గౌణం చెయ్యడంవల్ల గాంధిజీని కూడా అనవసర విమర్శలికి గురిచేసిన వారవుతున్నారు.

గాంధీజీ దేవుడని కొందరు గాంధీభక్తులు భావించడం కూడా వుంది. అందువల్ల ఆయనని ఏమాత్రం విమర్శించినా మహాపాపమనే ఉద్దేశంతో అసహనాన్ని పెంచుకోటం జరుగుతోంది. ఆమధ్య గాంధీకోటి రాయడం, రాసినవాళ్లకి బహుమతులివ్వడం, గాంధి అష్టోత్తర శతసహస్రనామ పూజలు చెయ్యడం జరిగింది. సరే మొన్నిమధ్యే గాంధీ దేవాలయం కూడా కట్టారు కొందరు భక్తులు. ఆ సంగతి విని "నా దేవాలయం కట్టి నన్ను భూస్థాపితం చేద్దామనుకుంటున్నారా" అని గాంధీజీయే ఎంతో ఆవేదనపడ్డాడు.

1. "గాంధీజీకా సమాజ్ వాద్"

గాంధీ భక్తుల్లో కొందరు ఆధ్యాత్మికాభిరుచిని పెంపొందించుకుని సాంఘిక రాజకీయ దృష్టులతో విషయపరిశీలన చెయ్యటమే మానెయ్యటం మూలాన, అలా పరిశీలించేవారిని గాంధీ వాదవ్యతిరేకులుగా జమకట్టడం జరుగుతోంది. ఒక మహాపురుషుడు చనిపోయేముందు " ['నా అనుయాయులతో జాగ్రత్తగా మెలగండిసుమా!' అని నా సమాధి మీద వ్రాయించండి" అని దగ్గిరున్న వాళ్లతో చెప్పాడుట. మార్క్సిజం పేరుతో దెబ్బలాడుకు చస్తున్న వాళ్లనిచూసి "నేను మాత్రం మార్క్సిస్టును కాను" అన్నాడు మార్క్స్.[1] గొప్ప గొప్ప మతాలికీ, ధర్మాలికీ దుర్గతిపట్టడానికి, కారణ భూతులు యీఅంధానుయాయులే. "నేను చచ్చిపోయిన తరవాత నా దేహంతో పాటు నారచనల్ని కూడా దహనంచేస్తే బాగుంటుందేమో! లేకపోతే నా అనుయాయులు, నావ్రాతల్ని పట్టుకుని దెబ్బలాడుతారు." అని ఆవేదన పడ్డాడు గాంధీజీ. అనుయాయులలో స్వతంత్రాలోచన నశించడమే ఏ వాదానికైనా మహాశత్రువు.

కొందరు అమాయకత్వంచేతా, కొందరు బుద్ధి పూర్వకంగానూ "సోషలిజం విదేశీసరుకు. మనదేశపు సభ్యతా సాంప్రదాయం, సంస్కృతీ, నాగరికతా, భూగోళ పరిస్థితులూ, శీతోష్ణాలూ విశిష్టమైనవి. కనక సోషలిజం మనదేశానికి పనికిరాదు" అని అపోహ పడుతున్నారు. గాంధీజీయే చెప్పిన యీమాటలు పరికిస్తే పైఅపోహ నిస్సందేహంగా తొలిగిపోతుంది. "నేను కూడా సోషలిస్టు కమ్యూనిస్టుల మాదిరిగానే ధనికతత్వాన్ని దాదాపు సంపూర్ణంగా తుదముట్టించాలనే కోరుతున్నా." 'గాంధీజీ సోషలిజాన్ని గురించి ఏమంటున్నాడు?' అనే ప్రకరణలో యీ విషయం విపులంగా చర్చింపబడింది.)

దేశకాల పరిస్థితుల్నిబట్టి విధానంలో కొన్నిమార్పులు చెయ్యాల్సిరావచ్చుతప్ప సోషలిజం ఒకదేశానికి పనికివచ్చి ఇంకో

1. 'Kisans & Communists'

దేశానికి పనికిరాకపోదు. అదీగాక వర్గయుద్ధం పనికిరాదనీ, వర్గ సామరస్యమే పరమౌషధమనీ, పాశ్చాత్యుల్లోకూడా కొందరు చెప్తూనేవున్నారు. హెచ్. జి. వెల్సు సాక్షాత్తు స్టాలిన్‌తోనే యిలా అన్నాడు "వర్గయుద్ధం కేవలం తెలివితక్కువతనం. పెట్టుబడిదారీ విధానం వర్గప్రయోజనాల సామరస్యంవల్లనే అంతం కావటం సాధ్యమవుతుంది. అందుకు సరైన నాయకత్వం కావాలి"[1]

ధర్మకర్తృత్వసిద్ధాంతంకూడా పాశ్చాత్యదేశాల్లో లేకపోలేదు. విలియంగోడ్విన్ 'పొలిటికల్ జస్టిస్' అనే తనగ్రంథంలో యిలా వ్రాశాడు: అన్నిమతాల ప్రవక్తలూ ధనికులకు తమశిష్యులతో యిలా చెబుతూవచ్చారు 'మీదగ్గరవున్న డబ్బుకి మీరు ట్రస్టీలు. కనక ఖర్చుపెట్టిన ప్రతిదమ్మిడికీ మీరు బాధ్యతవహించాలి.' ఇంతకీవిధానాన్నైనా పరిశీలించేటప్పుడు, లాభనష్టాలు విచారించాలి కాని విదేశీదా, స్వదేశీదా, అని ఆలోచించక్కర్లేదు. గాంధీజీయే స్వదేశీ విషయమై యిలా అన్నాడు: "విదేశీవస్తువులైనంత మాత్రంచేత వాటిని తిరస్కరించి, మనదేశంలో ఉత్పత్తి చెయ్యడానికి వీలుకాని వస్తువుల్నికూడా తయారుచెయ్యటానికి జాతీయ సంపదని కాలాన్ని వృథాగా వ్యయపరచడం మహాపరాధం. స్వదేశీతత్వానికి వ్యతిరేకం"[2] నిజం ఆలోచిస్తే సోషలిస్టు సిద్ధాంతంఅచ్చంగా పాశ్చాత్యమూ కాదు, గాంధీజమ్ సిద్ధాంతం అచ్చంగా ప్రాచ్యమూ కాదు. రెండు రకాల్లోనూ ప్రాచ్య పాశ్చాత్యాలు కలిసేవున్నాయి. కనక స్వదేశీ విదేశీ విధానాలనే కారణంతో గాంధీజాన్ని సోషలిజాన్ని అంగీకరించడంగాని నిరాకరించడంగాని అసంగతం, అవివేకం.

"అంతర్వాణి అనే పేరుతో గాంధీజీ, ముందుగానే నిర్ణయానికివచ్చి, తరవాత దానికి కారణాలు వెతుకుతాడు" అని ఒక ఆరోపణ చేయబడుతోంది. ఇది శాస్త్రీయం కాకపోవచ్చు. కాని కొన్ని

---

1. గాంధీవాద్ ఔర్ సమాజవాద్ పే. 141
2. Young India *D*/ 18-6-31.

సందర్భాల్లో సహజమే మోననిపిస్తుంది. 1914-18 ప్రపంచయుద్ధంలో ఫీల్డుమార్షల్ రాబర్ట్సన్ జనరల్ హేగ్ కి ఒక ఉత్తరంలో "పశ్చిమాన సేను చేసే పురోగమనానికి 'లాభకరం' అని చేసేవాద బలం కంటె అంతర్బోధబలమే ఎక్కువ కారణం" అని రాశాడు.[1] అదీగాక గాంధీజీ అంతర్వాణి ప్రబోధంవల్లనే ఒక నిర్ణయానికివచ్చినా యితరులు దానిని ఆమోదించేటప్పుడు శాస్త్రీయంగా చర్చించే అవకాశం తప్పకుండా గాంధీజీ యిచ్చేటప్పుడు ఆయనఅంతర్వాణి ఎవరికీ ప్రతిబంధకం కాజాలదు. వర్ధా విద్యావిధానాన్ని ఆక్షేపిస్తూ, 'విద్యార్థులచేత కాయకష్టం చేయించడం తప్పు' అనే వారున్నారు. రష్యాలోని ప్రాథమిక పాఠశాలల్లో విద్యార్థులు రోజుకు 7 గంటలు పనిచేస్తారు.[2] బ్రిటిష్ ఉపాధ్యాయుల ప్రతినిధి వర్గంవారు ఒక మాస్కో కిండర్ గార్టెన్ లో చాలావరకు విద్యార్థులే తమకి కావాల్సిన వస్తువులన్నీ తయారుచేసుకుంటారు. వంట, అంట్లుతోమటం తప్ప తక్కిన యింటిచాకిరీ అంతా కూడా వాళ్లే చేసుకుంటారు" అని రాశారు.[3]

ఇంకొక అపోహావిషయం కూడా ముచ్చటించి ఈ పుస్తకం ముగిద్దాం—సోషలిజాన్ని కొంతవరకుఅమలులో పెట్టిన రష్యాభూతల స్వర్గమని కొందరూ, నీతినియమాలు లేని భూలోకనరకమని కొందరూ అపోహపడుతున్నారు. వాస్తవానికి అది స్వర్గమూ కాదు—నరకమూ కాదు. తన దేశంయొక్క బాగుకి కొన్ని ప్రయోగాలు చేస్తోంది రష్యా. తప్పులొస్తున్నాయి, దిద్దుకొంటోంది. అక్కడ నీతినియమాలు లేకపోవటం ఎలాంటి అపోహో యీ భాగం ప్రారంభంలోనే పరిశీలించాం. అది సాక్షాత్తు దేవతల్లాంటివాళ్లకి పుట్టిల్లు అనుకోటం ఎలాంటి అపోహో యీ క్రింది అంశాలవల్ల తెలుసుకోవచ్చు. అక్కడి రైళ్ళల్లో గట్టిసీట్లూ, సాధారణపు మెత్తనిసీట్లు, మెత్తనిసీట్లు అని 3 రకాలుంటాయి. మెత్తనిసీట్లు అంత

1. Gandhi & Gandhism P. 128. 2. Education in U. S.S. R. P- 29. 3. Children in U. S. R P. 14.

జాతీయ శకటాల్లో వుంటాయి. వాటిల్లో బాగా పెద్ద పెద్ద ఉద్యోగస్థులూ, విదేశీయులూ ప్రయాణం చేస్తారు. మామూలుగా టిక్కెట్టుకొంటానికి గంటల తరబడి బుక్కింగ్ ఆఫీసు దగ్గిర కాచుకు కూర్చోవాలి".[1] —ఇదీ రైలు ప్రయాణాల విషయం. ఇక షాపుల్లో సంగతి. "షాపుల్లోకూడా మూడురకాలుంటాయి. (1) ప్రైవేటు వర్తకులు వ్యాపారంచేసుకునేందుకు వీలైన మార్కెట్టులు (2) ప్రైవేటు షాపులు, (3) కో ఆపరేటివ్ లూ, గవర్నమెంటు ట్రస్టుషాపులు. మూడో రకం షాపుల్లో వస్తువులు చాలా మంచివీ, చౌకాను. కనక యిట్టే ఖర్చయిపోతాయి... ఒక్కొక్కప్పుడు ప్రైవేటువర్తకుడు 100% లాభాలుకూడా తీస్తాడు. బజారులో నడుస్తుంటె ప్రతి 50 గజాలికీ ఓసిగరెట్లు అమ్మేవాడు ప్రత్యక్షమౌతాడు."[1]

రష్యాలో ప్రజలంతా సత్యహరిశ్చంద్రులని కొందరిభ్రమ. రైలుస్టేషను ప్లాటుఫారంమీద పెట్టె పెట్టి కాస్త యధాలాపంగా వుంటే యిహదక్కదు...మాస్కోలో కొంతకాలంవున్నవాడెవడన్నా జేబుదొంగ తనానికి గురికాకుండా వుంటే నేను అమితంగా ఆశ్చర్య పడాలిసి వొస్తుంది."![1]

పై పరిస్థితులు తరవాత మారివుండవచ్చు. లేకపోతే రేపు మారవచ్చు. అసలు మారకనే పోవచ్చు. అదికాదు మనకి కావాల్సింది. దేన్నిగురించీ మంచిగాగాని చెడ్డగాగాని భ్రమలూ అపోహాలూ వుండరాదు. అదీగాక రష్యాలోవున్న ప్రతి విషయాన్నీ సోషలిజానికి ఆపాదించటంకాని, రష్యాలో లేని మంచి మార్పు సోషలిజంలో వుండజాలదని అనుకోటం గాని పొరబాటు. రష్యాసాధించలేని ఒక మంచి సోషలిస్టు సిద్ధాంతాన్ని మనంసాధించవచ్చు. సోషలిజం పేరుతో రష్యాలో అమలుజరపబడుతున్న మరో చెడు సిద్ధాంతాన్ని నిస్సందేహంగా నిరాకరించవచ్చు. మార్క్సు

1. 'Life under the Soviets'

చెప్పాడన్న మాత్రంచేత ఏమార్పునీ అంగీకరించక్కర్లేదు. ఆయన చెప్పలేదన్న మాత్రంచేత ఒకమార్పుని నిరాకరించక్కర్లేదు. అపౌరుషేయాలని భావింపబడే వేదాల్ని, అవతార పురుషుడని కొందరిచే భావింపబడే, గాంధీజీనికూడా విమర్శించటానికి హక్కుందనుకునే ఏఅతివాదన్నా, ఎవరిచేతా ఎప్పుడూ అవతార పురుషుడని భావించబడని మార్క్సునీ, అపౌరుషేయంకాని ఆయన వ్రాతల్ని, తూచా తప్పకుండా అనుసరించాలని వాదిస్తే అంతకంటే మూఢత్వం మూర్ఖతా యింకొకటి వుండదు.

సోషలిజం పేరుతోఅయినా కాకపోయినా, యీనాటి సంఘంలోగల ఆర్థిక సంబంధమైన హెచ్చుతగ్గులూ, దోపిడివిధానం కొంతవరకు మారితీరుతాయి. 'మారాల'నే అభివృద్ధినిరోధకులు కూడా అంటున్నారు. అలాంటి సూచనలేమీ లేనిరోజుల్లో ఆర్థిక విధానానికే అమితమగు ప్రాధాన్యంయిచ్చి భావ విప్లవం తెచ్చాడు మార్క్సు. కాని, ఆర్థికనిమ్నోన్నతాల్ని నిర్మూలించాలని సర్వసామాన్యంగా అందరిచేతా గుర్తింపబడిన యీరోజుల్లో ఆర్థికేతర విషయాల్నికూడా గమనించాల్సిన అవసరం ఎంతోవుంది. కనక గాంధీజీ ఆర్థికేతర, భౌతికేతర విషయాలికి ప్రాధాన్యం యిస్తూ కార్మిక కర్షకాభ్యుదయాన్నే కాకుండా, సర్వోదయాన్ని కాంక్షిస్తున్నాడు.[1] కాని ఆర్థికసమత్వం యింకా ఏర్పడనేలేదు సంఘంలో. ఆదిశలో భావాలు పరిగెత్తడంమాత్రం నిజమే. అంతమాత్రంచేతనే, ఆర్థిక విషయాలకి ప్రాముఖ్యం సాంతం తగ్గిస్తే 'పరిస్థితులు' యథాప్రకారంగానే వుండిపోయే ప్రమాదంవుంది. మహాత్ముని సదాశయాల్ని స్వార్థపరులు దుర్వినియోగం చేసుకో నియ్యరాదు.

"సోషలిజం లేనిదే సరైన ప్రజాస్వామికం లే"దంటారు సోషలిస్టులు. "సరైన ప్రజాస్వామికంగాని సోషలిజంగాని అహిం

1, 'Gandhism reconsidered' by Prof, Dantwala,

సాత్మకసంఘంలోనే తప్ప సాధ్యంకా"దంటాడు గాంధీజీ యింకా కొంచెం ముందుకుపోయి. అందుకనే "నిర్దుష్టమైన ప్రజాస్వామికం దేవతలికి పనికి ఒచ్చేది కాని, మనుష్యులికి కాదు" అన్నాడు రూసో.

ఏమైనా, యీనాడు భారతదేశంలో సోషలిజం, గాంధిజం ఒక విధమైన సమ్మేళనం పొందుతున్నాయి. ఆర్థికరంగంలో సోషలిస్టు సూత్రాలికీ, యితరరంగాల్లో గాంధీయ సూత్రాలికీ ఉజ్వలమగు భవిష్యత్తు కనిపిస్తోంది. ఈ సత్యాన్ని గుర్తించి నడవాలి వామదక్షిణ పక్షాలూ, మితవాద అతివాద వర్గాలూ కూడాను. గాంధీజం కేవలం ఊహల్లో నిర్మించుకునే ఆదర్శ సాంఘిక వ్యవస్థే తప్ప ఆచరణయోగ్యం కాదనీ, సోషలిజం, వ్యక్తిత్వాన్ని నశింపజేసే పాశవిక తత్వప్రదర్శనమని దూరంచెయ్యచూడటంవల్ల ఏమీ లాభంలేదు. అంతా కలిసి సామ్రాజ్యవ్యతిరేక సంయుక్త ప్రతిఘటనకి పూనుకోవాలి.